శ్రీ ర స్తు

# శ్రీమదుత్తర రామాయణము

సులభశైలి ద్విపదలో వ్రాయబడిన
శ్రీమద్రామాయణ, ఉత్తరరామాయణ,
భారత, భాగవతములందు
ఇది రెండవ సంపుటము



కవిభూషణ, కొండేపూడి సుబ్బారావు



# కృతజ్ఞత


This book is Published with the
Financial Assistance of
**Sri Tirumala Tirupathi Devasthanams**
under their scheme
Aid to Publish Religious Books




ఏవిభు నాత్మనెంచి రచియించితినో మహనీయ పుణ్యగా
థావళి యీపురాణకథ యాకరుణాళుఁడు వేంకటేశ్వర
శ్రీవిలసత్కృపామహిమచే లభియించెను దీనికిట్టి శో
భావహమైన రూపవిభవమ్ములు సుందరముద్రణాకృతుల్.




ఈ కావ్యము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ద్రవ్యసహాయమున ముద్రితము
వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

# భూమిక

## మన పురాణములు - మన సంస్కృతి

ఏ జాతియైనను తన సమాజమునకు ప్రయోజనకారిగా నుండునటుల అలవఱచుకొనిన జీవన విధానమే సంస్కృతి కేవలము బాహ్యములగు వేషభాషలకే గాక అంతరంగిక మగు మనోవృత్తికికూడ సంబంధించిన విషయమిది భారతీయ సంస్కృతి యందొక ప్రత్యేకత కలదు ఐహిక సౌఖ్యముతో పాటు ఆధ్యాత్మికానందమును లక్ష్యముగా నెంచుకొనిన జీవన విధానము భారతీయ సంస్కృతి భారతజాతి నొక్క-దానినే గాక విశ్వమానవ జాతిని దృష్టియందుంచుకొని నిర్వ-చించిన పవిత్ర జీవన విధానము భారతీయ సంస్కృతి

భారతీయ సంస్కృతికి మూలాధారములైన వేదోపనిషత్తుల యందలి కొన్ని సూత్రములను చూడుడు

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై మావిద్విషావహై,
సర్వేజనాః సుఖినోభవన్తు ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

మన ధార్మిక గ్రంథము లన్నిటి యందును ఇత్యాదులనేకములు కలవు ప్రజా పరిపాలనము న్యాయమార్గమున

జరిగి, ప్రజలందఱు పరస్పర విద్వేషములు లేక సుఖముగా శాంతి సంపదలతో వర్ధిల్లవలయునని వీని కేంద్ర భావము విశ్వ మానవ కళ్యాణమే ఆశయముగా నిర్వచింపబడిన సార్వజనీన సార్వకాలికములైన శాశ్వతధర్మము లివి ఈ హేతువు చేతనే భారతీయ సంస్కృతి ప్రపంచ విఖ్యాతి నందినది

ప్రపంచమందలి ఇతర దేశములు కన్నుదెఱవని పూర్వ కాలమునందే ఇట్టి మహనీయ సంస్కృతిని విజయవంతిముగ ప్రచారము చేయగల్గినది వ్యాసుడు వాల్మీకి మున్నగు మహర్షులు బ్రహ్మజ్ఞానులు, తపస్సంపన్నులు, నిస్స్వార్థపరులు, ప్రజాసేవకులు అయిన మహర్షు లెందఱో మున్ను ఈ దేశమునం దుద్భవించుట మన భాగ్యము ఆధ్యాత్మిక చింతనావశ్యకతతో బాటు ఉత్తమ మానవధర్మములను ప్రజలలో విస్తృతముగ ప్రచారము గావించుటకై అనేక పురాణ ఇతిహాసములను వ్రాసి ప్రజల కందజేసిన మహాత్ము లీ ఋషులే

ఈ గ్రంథములందు భగవన్మహిమాభి వర్ణనముతో బాటు, యుగయుగముల నుండి భారతదేశమున జ్ఞానయోగులు, కర్మయోగులు, ఉత్తమ రత్నులు, ధర్మపాలకులునైన పెక్కు ప్రసిద్ధ వ్యక్తుల జీవిత చరిత్రములు కలవు ప్రతిగాథ యందును దైవభక్తి, సత్యము, ధర్మము, త్యాగము మున్నగు నైతిక విషయములెన్నియో ప్రస్ఫుటముగ ప్రకాశించుచున్నవి ఈ పురాణేతిహాసములు బహుజనములయందు

బహుళభాషలందు వ్యాప్తిగాంచి జగత్పూజ్యములై యలరుచున్నవి

అమరవాణి యగు సంస్కృతమున ఆదికావ్యముగ శ్రీమద్రామాయణమును వ్రాసిన కవి వాల్మీకిమహర్షి శ్రీ మహాభారత, భాగవతములను వ్రాసినది వ్యాసమహర్షి నన్నయ, తిక్కనాది మహాకవులు ఎన్నో శతాబ్దుల పూర్వమే వీనిని తెనిగించి ఆంధ్రజాతికి మహోత్కృష్టమగు సేవ గావించిరి మనజాతి సంస్కృతికి జీవగఱ్ఱలు, ఉత్తమములు, శాశ్వతములు అయిన మానవ ధర్మములను బోధించు ఈ మహాకావ్యములకు ఆంధ్రమునందే పెక్కు అనువాదములు, అనుసరణములు ఆ తరువాత వచ్చినవి ఇంకను వచ్చుచున్నవి

ప్రపంచమందలి వివిధ దేశములు ఒకదానికొకటి దగ్గఱకు వచ్చుచు, ఒక జాతిని మఱొక జాతి ప్రభావితము చేయుచున్న నేటి కాలపరిస్థితులలో యుగయుగములనుండి అవిచ్ఛిన్నముగ సాగుచు సర్వ మానవజాతి కాదర్శప్రాయమైన మన సంస్కృతి, ధర్మములను మఱింత పటిష్ఠ మొనరింప వలసిన ఆవశ్యకత నేడెంతో యున్నది ఈ జీవన విధానము నందలి గొప్పతనము, సత్యము ప్రతి వ్యక్తికిని తెలియవలయును

ఈ ఆశయముతోడనే, వేదోపనిషత్తుల సారమగు శ్రీమద్భగవద్గీతను, సంపూర్ణముగ సులభశైలి తెలుగు పద్య

తాత్పర్యములతో అనువదించి ఇటీవలనే ప్రచురించితిని ఆ కావ్యమునకు విశేష ప్రజాదరణ లభించినది - నేను మరల, సామాన్యులకు కూడ బోధపడు ద్విపదలో శ్రీమద్రామాయణము, ఉత్తరరామాయణము, మహాభారతము, భాగవతములను రచించి ఆంధ్ర ప్రజల కందించుచున్నాను అనుబంధ కథలను, వర్ణనలను వదలి ప్రధాన కథాంశమునే వీనియందు పొందుపఱచితిని

ఈ కావ్యములవలన, మన భారతీయ జీవన ధర్మములను నైతికాదర్శములను చదువరులు ఏమాత్రము గ్రహింపగలిగినను నేను కృతకృత్యుడనని భావింతును ఇట్టి యుత్కృష్ట గ్రంథములను సంక్షేపించి వ్రాయుటలో కొన్ని లోపములు దొసగులును కావచ్చును వానిని పఠితలు సహృదయముతో చూడవలెనని నా మనవి

ఈ కావ్యముల ముద్రణకు కొంత ద్రవ్యసహాయము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమునుండి లభించినది వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతను, వందనములను యతియొక్క సారి తెలుపుచున్నాను శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహమున నా యీ కావ్యములు ప్రజాదరణ పాత్రములు కాగలవని విశ్వసించుచున్నాను

— గ్రంథకర్త

# సమర్పణము

దైవసన్నిభులు, భారతదేశ విఖ్యాతికి
మూలకారణులు సర్వజగత్పూజ్యులు అయిన
శ్రీ వాల్మీకి వ్యాసమహర్షుల పాదపద్మసంస్మరణ పూర్వకముగ
ఈ కావ్యము సమర్పితము

1

శ్రీకర మున్నతాశయవిశిష్టము సర్వజనప్రమోద సౌ
ఖ్యాకర మార్యధర్మపరమార్థమునై విలసిల్లు రామగా
థాకమనీయ కావ్యకవితన్ భువికిచ్చిన పుణ్యరాశి వా
ల్మీకికి కేలుమోడ్చి ప్రణమిల్లెద నాదికవీంద్రమూర్తికిన్

2

వాసిత ధర్మమార్గవిభవాత్ముడు సర్వపురాణకర్త ప్ర
జ్ఞాసముపేతు డుజ్జ్వలయశఃకలితుం డఖిలాగమార్థవి
న్యాసము తేర్పఱించిన మహామహితాత్ము డనంతశేముషీ
భాసురమూర్తి వ్యాసభగవానుని కంజలిపెట్టి మ్రొక్కెదన్

3

ఆ వాల్మీకియు వ్యాసమౌనియును దివ్యప్రాభవుల్ భారత
క్ష్మావిఖ్యాతికి మూలకారణులు లోకక్షేమ కార్యైక దీ
క్షావేశ ప్రథమానమూర్తులు జగత్సంపూజ్యులా మౌనిరాట్
సేవాసంస్మృతి కీపురాణరచనల్ చిహ్నమ్ములై పొల్చుతన్

# ప్రార్థన

## శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

విలసితసత్కృపాన్వితుడు విఘ్నములన్ దొలగించు దైవ ము
జ్జ్వల శశివర్ణసుందర శుభాంగుడు భక్తుల పూజనాదులన్
దొలుతగ స్వీకరించు విబుధోత్తముఁ డార్యకు ముద్దుబిడ్డడై
యలరిన గుజ్జువేలుపు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్

## శ్రీ సరస్వతీ ప్రార్థన

నలువకురాణియై నిగమనాదము లొప్పు పసిండివీణపై
లలితములైన జ్ఞానరుతులన్ పలికించిన వేల్పుటమ్మ వి
ద్యల నిడు తల్లి శారద సమర్పితసత్కృతు లంది కూర్మియై
వెలయునుగాత నాహృదయవీథుల కావ్యములల్లువేళలన్.

## సర్వ దేవతా ప్రార్థన

సలలితభక్తిఁ గొల్చు జనసంతతికిన్ కరుణాంతరంగులై
కలుములనిచ్చి నిస్తులసుఖమ్ములఁగూర్చి మనోవికాసముం
గలుగగఁజేయు భక్తజన కల్పకరాజి త్రిమూర్తులాదిగా
నలరెడు వేల్పుసాములకు నంజలులన్ ఘటియించి
మ్రొక్కెదన్

## పురాణ ప్రశంస

దురితములెల్లఁ బాపి పరితోషముసంగుచు కర్ణపేయమై
ధరణిని సౌఖ్యసంపద లుదారముగా నిడు దివ్యగాథ లెం
దఱు రచియించిరేనియు సదా ముదమిచ్చు నటంచు భక్తి నీ
పరమపురాణగాథలన వ్రాసితి నింకొకమారు పేమకన్

## కవి పండిత వందనము

పెద్దలకెల్ల మ్రొక్కి, పృథివిన్ మధురమ్మగు శబ్దసిద్ధితో
పద్దెము లల్లినట్టి కవిపండితకోటికి నంజలించి నే
నొద్దిక నీపురాణ రచనోద్యమమున్ గయికొంటి కావ్యసం
సిద్ధికి చిత్తమం దభిలషించుచు వారలొసంగు దీవనల్



# ఉత్తరరామాయణ కావ్యప్రశస్తి

పరమశ్రావ్యమభవ్యయామితకథా భవ్యంబు దీవ్యత్సుధీ
పరివత్సంతతసేవ్య మబ్జభవసంభావ్యంబునై మించు ను
త్తరరామాయణ కావ్యమున్ మృదువచోధారార్థ సందర్భ ని
ర్భరతత్త్వద్రసముల్ రహింప రచియింపంబూనితిన్ వేడుకన్

ఆవాల్మీకి మనీషివర్య మతిసంభావార్య సంశోభితం
బై విఖ్యాతిగ కామితార్థఫలదంబై శ్రీపదంబై సుశ
బ్దావాసంబయి మాధురిందనరు రామాంచత్కథాక్షీరపా
రావారంబు సమాశ్రయింతు కవితాప్రఖ్యాతి కర్హంబుగన్

ఉత్తరరామాయణము

—కంకంటి పాపరాజు

# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీ ఉత్తర రామాయణము

## పూర్వకథ

(శ్రీరాముని జననము నుండి రావణవధ వఱకు)

### బాలకాండము

ద్విపద —

శ్రీరమణీయమై చెలువారుచున్న
భారతోర్విని మున్ను పాలించినట్టి
భూనాథులందున ముఖ్యులై యలరి
రాణ కెక్కినవారు భానువంశజులు.
తమ కయోధ్యయె రాజధానిగ వారు
కొమరొప్ప నేలిరి కోసలావనిని.
ఇనవంశనృపుల యేల్బడియందు
జనులు సుఖించిరి సకలసంపదల.

ఇనవంశజాతులై యిల నేలినట్టి
ఘనులలో దశరథమనుజేశు డొకడు

సురలకే సాయమై యరిగిన ఘనుఁడు
ధరనేలె నాతఁడు తండ్రియు వోలె
మునివసిష్ఠుఁడు నీతిబోధకుల్ నుడువ
ఎనమండ్రు తనమంత్రు లెలమి సేవింప.
కౌసల్యయు సుమిత్ర కైకేయి యనఁగ
వాసిగ మువ్వురు భార్య లాతనికి
పుత్రకామేష్టిని పొలుపారఁ జేసి
పుత్రులు నలువురిన్ పొందె నానృపతి

ధారుణియందున దైత్యులు చాల
క్రూరులై జనులను గారించుచుండ
వారిని వధియింప వసుధపై నవుడు
శ్రీరాముఁడై పుట్టె నారాయణుండు
కౌసల్యగర్భాన ఘనవర్ణుఁ డగుచు
వాసిగ కైకకు భరతుండు బుట్టె
కలిగి రిద్వురు సుతు లల సుమిత్రకును
నలరితుల్ లక్ష్మణశత్రుఘ్ను లనఁగ.
దైవాంశ జనితు లాతనయులఁ జూచి
భూవరుఁ డుప్పొంగె ముదమంది మిగుల.
విలువిద్యతోఁ బాటు విద్యలన్నిటిని
పొలుపార నేర్చి రాపుత్రు లందఱును
వీరాధివీరులు విజ్ఞాను లనుచు

వారినిఁ గనుఁగొన్న వారెల్ల పొగడ
రమణీయమూర్తులు రామలక్ష్మణులు
తమజంట వీడరు ధరణి నెవ్వరును.
చిన్నతనమునండె (శ్రీ)రామమూర్తి
సన్నుతకార్యముల్ సలిపె నెన్నంటినో.
విపుల ధనుర్బాణవిద్యలఁ జూపి
తపసి జన్నముగాచ తాటకం జంపె
మునిగాధిజుఁడు రాముఘనతను మెచ్చి
వినుత బలాబల విద్యల నిచ్చెఁ.
సతి యహల్య కొసంగి శాపమోక్షణము
యతితోడ మిథిలకు నరిగి రాఘవుఁడు
ఘనమైన హరువిల్లు కరమున విరిచి
జనకజన్ పెండ్లాడె జనకునియింట
నిరుపమ విక్రమ స్ఫురణ దీపింప
పరశురాముని గర్వభంగ మ్మొనర్చె

---

## అయోధ్యాకాండము

శ్యామసుందరుఁడును సద్గుణరాశి
రాముఁడన్నను ప్రీతి ప్రజల కండ్లకు.
సర్వసమర్థుండు సత్యసంధుండు

ఉర్వికి వేల్పోలు ఉత్తమాశయుఁడు
ప్రముఖసద్గుణుఁడైన రామునిఁ గాంచి
తనమది సొప్పొంగి దశరథనృపతి
యౌవరాజ్యమ్మున కభిషిక్తుఁ జేయ
భావించుచుండగా వచ్చి కైకేయి
ధరణినాథునకు మున్ను తనకిచ్చినట్టి
వరముల రెండింటిన్ బడసంగఁ గోర
వనికి రామునిఁ బంపి పదునాలు గేండ్లు
తనయుని భరతుని ధరణీశుఁ జేయ
వృషభకేతనికి తనపతికి కోరికలు
పిడుగుపాటుగఁ దోచి పృథ్వి మూర్ఛిల్లె



## అరణ్యకాండము

జనకుని వాగ్దానము ను నిల్పుకొనుటకు
వనికేగ రాముఁడు మునివేష మూని
సీతయు లక్ష్మణుం డాతని వెనుక
ప్రీతితో జరిగిరి విపినభూములకు.
సూతుఁడు రామునికయి శోకించి మిగుల
మృతిఁజెందె దశరథమేదినీశుండు.

అన్న రాజ్యమును తా నాశించఁబోక
అన్న పాదుకలను అర్థించి తెచ్చి
భరతుఁడు వానికి పట్టమ్ము గట్టి
ధరణినిఁ బాలించె ధర్మమార్గమున
వనులందుఁ దిరుగు రాముని వద్ద కేగి
మునులు వచించిరి దనుజుల బాధ
జనులను బాధించు దనుజుల నెల్ల
దునుమాడుదు నటంచు మునులకుఁ జెప్పి
దండకాటవిఁ జేరి తనవారి గూడి
యుండెను శ్రీరాముఁ డాకపర్ణకుటిని.

హర్షాతిశయమున దానవవనిత
శూర్పణఖ యొకర్తు సుందరాకృతిని
ప్రేమించితిని నిన్ను, పెండ్లాడుమనుచు
రామునివద్దకు రాఁబోవుచుండ
ముక్కుచెవుల్ గోయించి పోఁద్రోలె నతఁడు.
వికృతాకారయై యామె వేవేగ నేగి
ఖరదూషణాదులఁ బురికొల్పి పంప
దురమున రాముఁడే బరిమార్చె వారిఁ.
దునుమాడె రాముఁ డా దనుజుల నెల్ల
మునులును జనులును ముదమంది పొగడ.

అన్నరావణుకథ కామియు నేగి
ఎన్నెదో కల్పించి దేమేమొ నుడివి
శ్రీరాము డాప్త్యమున్ సీత యందమును
ప్రేరేచె లింపగ కేగఁ దీర్పంగ
వరములు బ్రహ్మచేఁ బడసి గర్వమున
ధరణిపైఁ దిరుగుచు సురలను ప్రజల
సకలబాధల బెట్టి సాధించుచున్న
ప్రకటదుర్మార్గుఁ డా రావణాసురుఁడు
రాముని వంచింప రావణుఁ డంత
రాముఁ డున్నట్టి యాశ్రమసీమకడకు
మాయలేడిగ పంపె మారీచు నొకని
ఆ యేణి దెమ్మని యవనిజ యడుగ
రాముఁ డాలేడికై రయమున నేగ
సౌమిత్రియును బోయె రాముని వెనుక
దనుజేంద్రుఁ డేతెంచి తపసి వేషమున
జనకజన్ చెఱబట్టి తనలంక కేగె

సీతను బలిమిని చెఱబట్టి యేగు
వైతేయు నెదిరించి ధైర్యాన పోరి
పక్షముల్ విఱుగగా వసుధపై దూలి
పక్షి.జటాయు వా పరిసరమందె
సీతకై వెదకెడు శ్రీరాము వరసి

దైతేయుఁ డొక్కఁడు తపసియై వచ్చి
జానకిఁ గొనిపోవు సంగతి నుడివి
ప్రాణముల్ విడిచె నా రాముని ముందె



## కిష్కింధాకాండము

భూమిజన్ గానక రామలక్ష్మణులు
వేమారు చింతించి వెదకుచు వనుల
దారియందు కబంధ దైత్యునిఁ జంపి
చేరిరి కిష్కింధ శ్రీఋశ్యమూకమున
హనుమంతుఁ డనియెడు వనచరవరుఁడు
వనులందు రామలక్ష్మణులను జూచి
కపిరాజు సుగ్రీవుకడకుఁ గొంపోయి
నిపుణత వారికి స్నేహమ్ము సలిపె
శ్రీరాము రాకకు కారణ మ్మెఱిఁగి
ధారుణీజాతను తప్పక వెదకి
కనుగొందు మని చెప్పె కపివరుఁ డంత
తనసతిం గైకొని తనయన్న వాలి
తనకిడు వెతలెల్ల వినిచె రామునికి
బలశాలి రాముఁడు వానినిఁ జంపి
చెలికానికి ముదమ్ము గలిగించె మిగుల.



## సుందరకాండము

అనిపెను సుగ్రీవుఁ డన్నిదిక్కులకు
తన కపిసేనను జనకజన్ వెదుక
హనుమంతుఁ డంతట నబ్ధి లంఘించి
జనకజన్ లంకలో వనమునఁ జూచి
తనదారి కడ్డమౌ దనుజుల నెల్ల
దునుమాడి లంకను తుదముట్టఁ గాల్చి
అనవాలుగ రాము నంగుళీయకము
జానకి కిడి రాముసంగతిఁ జెప్పి
ఆమె శిరోమణి నవనిజ యొసఁగ
రాముని కిడి యతిప్రమదమ్ముఁ గూర్చె

---

## యుద్ధకాండము

వనచరసేన తన్ననుసరింపంగ
వననిధి సేతువు నొనరించి దాటి
దనుజేంద్రు లంకపై దండెత్తె రాముఁ
డనుపమవిక్రమం బడరు తేజమున
రావణున్ విడనాడి రాముని జేరె
రావణుసోదరుం డా విభీషణుడు
కొడు కింద్రజిత్తును కుంభకర్ణుండు

నడువగా దనకొంత కడుగీర మధుర
దనుజసైన్యములతోడ దశకంఠుడేగ
పనిసేయ శ్రీరామచంద్రు పైకి
రామరావణ మహారణ సమృద్ధికి
భూమిధరములతో భూమి యల్లాడ
వనచరుల్ చంపిరి దనుజవీరులను
ఘనుడింద్రజిత్తును దునిమె లక్ష్మణుడు
శ్రీరాఘవుడు వీరనారాయణుండు
ఘోర కార్ముక మెత్తి కూల్చెను ధరణి
క్రూరులౌ రావణ కుంభకర్ణులను
ధారుణియందున దైత్యుల బాధ
లణగించి శ్రీరాము డేవరించినట్టి
ఘనకార్యమున కెల్ల జనులును మునులు
వనజభవాదులున్ వచ్చి వేనోళ్ళ
వినుతించి రాతని విజయవైభవము
దివిమీద మ్రోగెను దేవదుందుభులు
భువిమీద కురిసెను పుష్పవర్షములు

దనుజునింట వసించె తనపత్ని యనుచు
మనమున శంకింప ఘనుడు రాఘవుడు
తనదు సౌశీల్యమ్ము ధరణికిం జాట
ననలమ్ములో దూకె యవనిజసీత,

ఆ విభీషణు లంక కధిపతిఁ జేసి
పావని మొదలగు వారితోఁ గూడి
భూమిజం గైకొని పుష్పక మెక్కి
రాముఁడు విజయాభిరాముఁడై యేగ
సాకేతనగరికి సర్వపౌరులును
ప్రాకటవైభవ స్వాగత మ్మొసఁగ



# శ్రీ ఉత్తరరామాయణము

## ఉత్తరకాండము

### శ్రీరామ పట్టాభిషేకము

శ్రీరమ్య నవరత్న సింహాసనమున
శ్రీరాముఁడును సీత చేరి కూర్చుండి
మనమున నుప్పొంగ మాతకౌసల్య
మునివసిష్ఠాదులు తనరి దీవింప
ఇరుగడ సోదరు లెలమి నిల్వంగ
చరణముల్ హనుమంతుఁ డొఱఁగి సేవింప,
తగు కానుకలు నీయ ధారుణీపతులు
అగణితముదమున నలరి భూజనులు
వేదసూక్తులు శాస్త్రవిధిమంత్రములను
మోదమ్ముతో వచ్చి మునులు పఠింప
భూరిదానమ్ముల పుణ్యసత్కృతుల
ధారుణీప్రజ లెల్ల తనివి సెందంగ,
సలలిత మంగళస్వనము లింపార
విలసితసామ్రాజ్య విభవమ్ము లలర
విపుల పావననదీ విమలోదకములు
కపురేగి కొనిరాగ కనకపాత్రముల

అమరావతీ నగరాధిక్య మొల్ల
నమరె నయోధ్యయం దానాఁ డనంగ
ధారుణి కైశ్వర్యదాయక మ్మగుచు
శ్రీరామపట్టాభిషేకమ్ము జరిగె
తమకోర్కె లీడేరి ధరణి నినఁడు
రమణీయమూర్తి శ్రీరామచంద్రుండు
రాజయ్యె సౌఖ్యముల్ రాజిల్లు ననుచు
భూజను లానందపులకితులైరి
హరి కరుణాత్ముఁడై యలనాఁడు సర్వ
సురల కిచ్చినమాట సఫలపేర్చె నాఁడు,
దనుజుల నెగటార్చి ధర్మమ్ము నిలిపె
నని హర్షమును బొంది రమరు లెల్లరును.

---

## అగస్త్యాది మునుల రాక

రహిమీఱఁగ రాముని రాజ్యప్రశస్తి
బహుముఖమ్ముల విని ప్రమదమ్ము నంది
ఘనుఁ డగస్త్యుండును కణ్వాఖ్యుఁ డాది
మును లేగి శ్రీరామమనుజేశుఁ జూచి
రమణతో నేటికి రామరాజ్యమున
తమ సూక్తులకు సిద్ధి కనరిన దనుచు

"మేదినిరాముండు మేటిశ్రేష్ఠుఁ డగుచు
ఆదర్శపురుషుఁడై యలరారు గతి!
రాజ్యపాలుర కెల్ల రామరాజ్యమ్ము
పూజ్యమై యెల్లప్డు పొలుచుఁగాఁ గనుచు
వేదధర్మమ్ముల రాము విధిని గావించి
దీపించి రానందభావమ్ము లెసఁగ.

మహామునులరాకకు మనమున మిగుల
ఆనందభరితుఁడై యలరి రాఘవుఁడు
మునులకు భక్తితో మ్రొక్కి పూజించి
వినయభాషణముల ప్రీతితో వారి
కుశలమ్ము లడుగుచు సౌఖ్యంబుఁ జేసి
వినయమ్ముగా నిట్లు విజ్ఞప్తిఁ జేసె
"మేదినీవాసుల మేల్గోరు నట్టి
వేదస్వరూపులు విజ్ఞానఘనులు
అమలతపశ్శాలు లందఱు మీరు
తమరాకచే నేను ధన్యుండ నైతి
మీరు మహాత్ములు మేధాశీలయులు
మీరెఱుంగని వింత ధారుణి లేవు,
అనుపమబలుఁడనై యాలంక కరిగి
జనకజ నొంటిఁగని విక్రమం బడర
దనుజనాథుని గాని దుష్టరాక్షసుల

మనమునఁ గలఁ గోరి ఘనుఁగంటి సంశయమ్ము,
ఆరావణాసురుఁ డెంత ప్రబలుఁ డగును
ధాటిని వంపెటి వీరు లెట్లయిరి?
అంతటి శక్తి యెట్లబ్బె వారలకు
సాంతమ్ముగా వారిచరితమ్ము నాకు
వినిపింపు" మనిపేర మునియగస్త్యుండు
వినిపించె నిట్టు లాదనుజులఁ గూర్చి

— —

## రావణుని చరితము

"సత్యమ్ము నీపల్కు సకలమ్ము రామ!
అత్యంతవీరు లాయసురు లందఱును
రామచంద్రా! విను రావణుం డనఁగ
సామాన్యదైత్యుఁడు భూమినిఁ గాఁడు
అనఘుఁ డాబ్రహ్మకు మునిమనుమఁ డగుచు
జనియించి వరములు ఘనముగా నంది
జగమునందున తనసాటి లేరనుచు
తెగువతోఁ దిరిగిన ధీరుఁ డతండు
విను మాతనిచరిత్ర వినుమంచు నుడివె
మునియగస్త్యుం డిట్లు మొదటినుండియును.

అల బ్రహ్మకొడుక తనని కొడుకాడు
కలడు పులస్త్యుడన్ కడుగొప్పమునీఁడు.
తృణబిందుసుతయందు తన పులస్త్యుండు
విదితతపశ్శాలి విశ్రవోమునిని.
మునిభరద్వాజుని పుత్రికయందు
ధనదు కుబేరునిఁగన విశ్రవుండు
ఘనతపమ్ము కుబేరుఁ డొనరించి పుష్ప
ప్రముఖవరమ్ములు బ్రహ్మచే నందె.
కూరిమి బ్రహ్మ కుబేరున కొసఁగ
భూరివిమానమ్ము పుష్పక మనఁగ
ధననిధుల్ తనయొద్ద తనరారఁ జెంత
జనకుని యానతిఁ గొని కుబేరుండు
పాలించుచుండెను వైభవోపేత
లాలితనగరమ్ము లంకాపురమ్ము

అసురసంతతి సైత మా బ్రహ్మవలన
వసుధపై సృజియింపఁబడెను శ్రీరామ!
అతిబలవంతుఁడున్ అతిదుష్టచరితు
లతిగర్వితాత్ము లాయ సురులయందు
మహితవీరుం డుండె మాల్యవంతుండు
బహువరమ్ము లతండు బ్రహ్మచేఁ బడసి
దేవేంద్రుపై నేగి దీనునిఁ జేసి

శ్రీవిష్ణువా దైత్యశావ ప్పమర్చె
ట్టుపిడక మాల్యవంతుండు మిగుల
కట్టయై జగముల చీకాకు పఱచె.
అల సుమాలియు మాలి యను తనిసోదరులు
బలవంతు లతనికి బాసటై నిలువ
బలిమియై చని మాల్యవంతుండు చేరె
లక్షితవాస్యైన లంకాపురమ్ము
జనులకు బాధల నొనరించు చండి,
అటుల నెలుకంగ నమరులం గూడ
పోరిరి సురలను పాలియింపం జాలు
వీరునిం జూడగాం గోరి సుమాలి
వినుతతపమొనర్చు విశ్రవు వరసి
వినుతించి ధూతని విఖ్యాతి నల్ల
అనుపమ సుందరియైన కైకసిని
కానుకతో నతనికి తగునట్లు నిచ్చె.



## రావణ కుంభకర్ణుల జననము

సురలెల్ల దిగులొంద వెఱగంద నారు
లిరువుర రక్కసుల్ నిరుపమబలులు
ప్రాకటసత్త్వులు ప్రభవించినారు
కైకసి గర్భాన లోకకంటకులు,

క్రూరులు రావణ కుంభకర్ణులను
ధారుణీప్రళయులు వారి శ్రీరామ !
పదిశిరస్సులతోడ భయదరావమున
నుదయించె రావణుం డుగ్రుఁడై యవని
కొండంత తనువుతో కుంభకర్ణుండు
దండియోధుండయి ధరణి జనించె
పుడమి నాయిరువురు పుట్టిన యపుడె
అవని నుత్పాతముల్ పిడుగులు రాలె

ఇలమీద కీర్తిత్వ్య లెంచు కొందరు
కలదొక హేతు వాగాథను వినుము
వీర లిద్దరు జయవిజయు లనంగ
ద్వారపాలురు మున్ను వైకుంఠ పురిని
వనజాక్షుఁ జూడగా చనుదెంచినట్టి
సనకసనందులన్ సంయమివరుల
నతిగర్వమున వీర లాశంకపఱుప
యతివరుల్ కోపించి రాగ్రహమ్మునఁగ
"దనుజులై మువ్వూరు ధరణిని మీరు
జననమందుడు దుష్టచరితులై" యనుచు
వీరి కాశాపమ్ము కారణమగుచు
శ్రీరామ యిద్యది కెంతవఱక్కు

నీకృపాగరిమచే నీచేతఁ జచ్చి
వైకుంఠనగరికి వచ్చిరి తిరిగి

జనియించె నావెన్క వనిత కైకసికి
వినుతసద్గుణుడు విభీషణుండనఁగ
మునివేషములు దాల్చి ముగురుసోదరులు
వనముల ఘనతపోవ్రతము లొనర్చి
వరములు బ్రహ్మచేఁ బడసిరి పెక్కు
ధరణియందున వారిసరి లేరనంగ

నరుఁడల్పు డని యెట్టినరునను గొనక
సుర యక్ష గంధర్వ గరుడోరగములు
మృతి వేనిచేఁగూడ ధరణిలోఁ దనకు
మరణమ్ము లేకుండ వరమును బొంది
ఇలయందుఁ దన కెవ్వ రెదురు లేరనుచు
బలితుఁడై రావణుం దలరుచు నుండె.
ధారుణి పెనునిద్ర తపవరమ్ముగను
కోర నాసక్తితో కుంభకర్ణుండు
అల విభీషణు బుద్ధి కలరి విరించి
సలలిత సద్గుణ సంపద నిచ్చె

## ఇంద్రజిత్తు

నయశీల సుందరి నవయౌవనాంగి
యయిన మండోదరిన్ మయుని పుత్రికను
పరిణయ మ్మాడెను వలచి రావణుడు.
అపుడెంచి మయుడంత నల్లునికలిమి
బహుమానముగ నిచ్చె పాటవోదగ్ర
మహనీయమగు నొక మారణశక్తి.
అనియందు శ్రీరాము! ఆ శక్తి వలన
మనలక్ష్మణుడు మూర్ఛమునిఁగె నానాఁడు
దితిజనాథుడు తనసతియందు గనియె
నతిసాహసుం డగు సుతు మేఘనాదు
నిలయందు నీతఁడే యింద్రజిత్తయ్యె
బలమున దేవేంద్రుఁ బట్టి తూలించి



## రావణుడు కైలాసగిరి నెత్తబోయి పరాభవ మందుట

తనబలమ్మును జూచి తనయునిఁ జూచి
దనుజసేనల జూచి దర్ప మ్మెసంగ
రావణుఁ డొనరించు క్రౌర్యమున్ రామ

భావింప నేరకిన్ వలనుగా దిలను
లంకాపురి భాగ్యలక్ష్మి నాసించి
శంక లేకింతయు స్వాంతమ్మునందు
అన్న కుబేరుపై నరికి దండెత్తి
క్రన్ననఁ గొనియె లంకారాజ్య మెల్ల
తనపుష్పకమ్మును తనలంక నెల్ల
ధనదుండు విడనాడి గాని దీనుఁడగుచు
శివుని కైలాసమ్ముఁ జేరి వసించె.
జవమున నటకును చని రావణుండు
కరముల నంటించి కైలాస మెత్త
హరుఁడు కోపించి యాయసురు నచ్చటనె
గిరిక్రింద గట్టిగా నిఱికించి యదుమ
ప్రాణభయమ్మున రావణుఁ డంత
వేవేళ్ళ దీనుఁడై వినుతించి మ్రొక్కి
శివుని ప్రసన్నుఁగాఁ జేసి ప్రార్థించి
ప్రవిమల వరములఁ బడసె నెక్కొంటి.



## రావణునికి వేదవతి శాపము

అభవుని మన్నన లంది రావణుఁడు
అభయుఁడై విహరించి యమరలోకమున

హిమగిరి కరుదెంచి వీక్షించె నచట
అమలతపస్విని యగు వేదవతిని
ముని కుశధ్వజుఁ డామె జనకుండు మదిని
వనజాక్షునకె తన తనయ నీయంగ
తలఁచుచు ధరణిపై తనువు చాలించె
తలపు లాహరిపైన నిలిపి వేదవతి
ఆవేళనుండియు నతినిష్ఠతోడఁ
గావించుచుండెను కఠినతపమ్ము.

ఆమె మైసోయగ మామె యౌవనము
కాంచి రావణుం డామెఁ జేరి
యెంత గష్టుమాడి యేమిచెప్పినను
సుంతైన వినక నాసుదతి వేణికను
కరమునఁ గొని బలాత్కారమ్ము సేయ
వెరవున నాతని వెనుకకుఁ ద్రోసి
"ఓరోరి దుష్టుఁడ యోరి రావణుఁడ!
క్రూరత పౌలస్త్యకులమెల్లఁ జెఱచి
ఈపాపకర్మమ్ము లేల చేసెదవు
నీపాగ రణగంగ నేను ధారుణిని
మరల జన్మింతు నీమరణహేతువుగ
మఱువకు మీమాట మనమున నింక
నీవు తాకిన దేహ మేనొల్ల" నడుచు

పావన నిజయోగ పావక శిఖల
నా వేదవతి చొచ్చి యాహుతి యయ్యె
ఆ వేదవతి సాహసావేశములకు
అతివ శాపవాక్యమ్ముల కదలి
దైతేయనాథుఁడు దీనుఁడై వడలెఁ.

ఆ మహాలక్ష్మియే ఆ వేదవతియు
భూమిని సీతయై పుట్టె శ్రీరామ !
ఆ కేశవుఁడ వీవు ఆ లక్ష్మి సీత
వైకుంఠనగర మీసాకేతపురము
మా తపఃఫలముగా సీతను నిన్ను
ప్రీతిగ గంటిమి శ్రీరామ" యనుచు
ముని యగస్త్యుం డిట్లు వినిపించె మరల
వినుచుండ రాముఁడు వినయభావమున.

---

## రావణుని దుష్టచర్యలు

అలివచే పరిభవ మంది నప్పటికి
దితిజనాథుని మతి తిరుగనే లేదు
తన బలగర్వముల్ తన ప్రాభవమ్ము
తన యున్నతినిఁ జూపఁ దలఁచె నల్లెడలఁ.

మునివాటికల గాల్చి మునుల హింసించె
మనుజపాలురఁ బట్టి బంధించె మిగుల
ఉండరాదని యెదు రుర్విపై తనకు
దండియై తిరుగాడు చుండె రావణుఁడు
ఇనకులమ్మున మున్ను జనియించి పట్టి
అనరణ్యుఁ డను నయోధ్యాధీశ్వరుండు
రణవీరుఁడై పోరి రావణు తోడ
వెనుకకు తగ్గెను వీర తలిర్ప



## కార్తవీర్యు నెదిరించి రావణుఁ డోడుట

మాహిష్మతీ రాజ్య మనుజేశ్వరుండు
బాహాసహస్రముల్ వరగు వీరుండు
కీర్తిశాలియు బలస్ఫూర్తిమంతుండు
కార్తవీర్యాఖ్యుఁడు కలఁడు రారాజు.
కూర్మిమై రాణులం గూడి యాతండు
నర్మదాతీరాన జయగార మొప్ప
విలసితరీతుల వేడ్క లింపార
లలితవిహారముల్ సలుపంగ నేగ

కార్తవీర్యుని బలఖ్యాతు లాలించి

కార్తవీర్యుని గెల్చు కాంక్ష మీఱంగ
రావణుం డేగెను రణధీరు డగుచు
పావన నర్మదా వాహిని కడకు
అరుదెంచి నదియొద్ద నసురనాథుండు
జరుపసాగెను పూజ శంభుని గూర్చి

క్రీడాపరుండైన కృతవీర్యసుతుండు
వేడుకగా తన వేయి చేతులను
నదికడ్డుగా చాచి నదినీటి నాపి
ముదమున సతులతో ముచ్చట లాడు
వర్తనల్ గమనించి ప్రబలకోపమున
నిటలాక్షుపూజల నేఁజేయుచుండ
ఇటుఁ గ్రీడ లాడెద వెవడ వీవనుచు
ధూర్తుండై యతనిపై దూఁకె రావణుఁడు
ధారుణి సాటిలేని దర్పోగ్రులైన
వీరాధివీరు లాతూరు లిద్దఱును.
పోరిరి తలపడి ఘోరయుద్ధమున
వారిధాటికి సర్వవసుధ కంపింప.
సమరమ్ము సమముగా సాగుచున్నంత
క్రమముగా బలితుఁడై కార్తవీర్యుండు
తన వేయిచేతులన్ దశకంఠు నెగసి
పెనగొని గట్టిగా బిగియించి పట్టి

కారాగృహమ్మున గట్టి బంధించె
పారిపోనీకుండ బయటి కెచ్చటికి.
మనుమని ఓటమి విని పులస్త్యుండు
చనుదెంచి వేగమ్మ స్వయముగా తాన
వినయమ్ముతోఁ గార్తవీర్యునిఁ జూచి
మనుమని విడిపించి వెనుక కంపించె

---

## వాలితోఁ బోరి రావణుడు భంగపాటు నొందుట

ఆరావణుని దర్ప మణఁగిన యట్టి
వేఱొక కథఁగూడ వినుము శ్రీరామ!
వాసవు సుతుఁడైన వాలియున్నతికి
ఈసు నొందుచు రావణాసురుం డలిగి
కిష్కింధ కేగి యాకీశుఁ బట్టి
నిష్కారణమ్ముగ నిందింప సాగ
వానరరాజంత ప్రబలుఁడై వచ్చి
దానవనాథుని తలలను బట్టి
సందీయకుండగ శ్వాసలకైన
సందిట నిరికించి చదలపై కెగసి
అంచితవీరుఁడై యవలఁ గొంపోయి
ముంచి తేల్చుచునుండె మున్నీటియందు

"రక్షింపు మోవాలి! రక్షింపు" మనుచు
రాక్షసేశుఁడు మ్రొక్కి ప్రార్థించుచునుఁ.
రావణదైత్యుని కావర మ్మట్లు
వావిరి పడఁదూల్చి వదలెను వాలి.

"అలీల రావణు నణచిన బలుఁడు
వాలి నొక్కమ్మునఁ గూలఁజేసితివి,
ఆ కార్తవీర్యుని కోర్చి పట్టి
ప్రాకటసత్త్వు డాపరశురాముని
గర్వ మడంచిన ఘనుఁడవు నీవు
సర్వధరిత్రి నీసముఁడవు నీవ
కొనియాడఁ దరమె నీఘనత శ్రీరామ!"
అని యగస్త్యుం డిట్లు వినిపించె వారల



## రావణుడు దేవతలపై దండెత్తుట

అరిగి రావణుం డవమాన మంది
పారిపోవుచునుండ నారదుం డరసి
"దశకంఠ! నీకేల? దైన్యభావమ్ము
విశదవిక్రముఁడవు వీరవర్యుఁడవు,
వనజసంభవుచేత వరములు నంది

అనుపమ బలుండవై యలరెదు నీవు
నరవానరుల మీఁది కరుగంగ నేల
సురలపై నీశక్తి చూపుమీ మనంగ
అణఁగిన శాసన మ్మంతయుఁ గూడ
దనుజేశు నాత్మలోఁ దలఁచుత్రె మరల
దనుజాధినాథుఁడై తనరుచున్నట్టి
తనగొప్పతనమును దలఁచి లోలోన
ఉప్పొంగి రావణుం డుత్సాహ మదుర
ఉప్పరం బగులంగ యుగ్రుఁడై యార్చి
సమధికసేనతో సాయుధుఁ డగుచు
సమరసన్నద్ధుఁడై యమునిపై నేఁగె.
తనమీఁది కూరక దండెత్తి పట్టి
దనుజేశుఁ గూల్పంగ చనుదెంచె యముఁడు
అక్షీణసాహసుల్ దక్షిణేశ్వరుఁడు
రాక్షసేశ్వరుఁడును రణము సేయంగ
కులగిరుల్ కదలెను కుంభిని వణఁకె
కలఁగె సంద్రమ్ములు కంపించె దిశలు,
ధారుణి కీడౌరు తగదని తలఁచి
వారించె మధ్యగా బ్రహ్మ యేతెంచి

---

### నాగలోకముపై దండయాత్ర

నాగుల సాధింప నాగలోకమున
కేగెను రావణుం జేవ మీఱంగ
అనుపమ శక్తితో నరుదెంచి పట్టి
దనుజేంద్రు నెదిరించు ధైర్యమ్ము లేక
వినయులై నాగులు వివిధసత్కృతుల
నొనరించి పంపిరి వెనుక కాతనిని

---

### వరుణునిపై దండయాత్ర

ఆగక నంతతో నా ధైర్యనిధుఁడు
సాగించె తనతీవ్ర సమరయాత్రలను
కాలకేయ నివాత కవచుల పైకి
కాలుదువ్వుచు నేగి కదన మ్మొనర్చి,
వరుణునిసుతులపై వరుస దండెత్తి
దురమున వారిని దునుమాడివచ్చె

---

### బలిచక్రవర్తి రావణునికి బుద్ధిచెప్పుట

చిన్నవారల పైని చెయిఁ జేసికొనుట
మన్నన గాదని మనమున నెంచి

వనజాక్షు వద్దకే వడిసేఁ యింక
తనబల మ్మెఱిఁగింపఁ దలఁచె రావణుఁడు

వామనమూర్తి చే వంచితుం డగుచు
భూమిని విడనాడి పోయిన యట్టి
దానవకులపతి దానవినోది
మానిత బహుశక్తి యుతుఁడౌ బలిని
రక్షించి యెటులైన ప్రాభవ మలర
శిక్షింతు వేగమే శ్రీహరి ననుచు,
సమధికోత్సాహుఁడై సాగి రావణుఁడు
ప్రముఖుఁ డాబలిరాజు వసియించు చున్న
పాతాళమున కేగి ద్వారమ్ము కడన
అతత తేజస్వియై యున్న యొకని
కనుగొని వెఱఁగంది కాళ్ళు వడంక
తనువున స్వేదముల్ ధారలై క్రమ్మ,
"నిలుచుంటి విచ్చట నీవెవ్వ"రనుచు
పలుకరించుట కైన భయపడి తుదకు
వెనుకదారిని బట్టి వెడలి లోనికిని
తన మనోవాంఛను వినయుఁడై పలికి
తెలుపంగ రావణున్ తిలకించి నవ్వి
బలి విస్మితుం డయి పలికె నీరీతి.

"ఓనిశాచర రాజ ! ఓయి లంకేశ !
మానుము వైర మామాధవుతోడ
వింతయయ్యెను నీవు వినిపించు మాట
వంత మేలను నీకు పద్మాక్షు తోడ
ఎవరని యెంచితో యెదలో హరిని
ప్రవిమల సత్కృపాకారిణుఁ డతఁడు
నీకును నాకును లోకాల కెల్ల
ఏకైక రక్షకుం డెఱుగు మీనిజము.
ఇలను హిరణ్యాక్షు డీరీతిగాన
వలినాక్షుతోఁ బోరి నాశన మయ్యె.
బదుక నక్కఱ లేదు విష్ణుని కొలుకు
ఎదుటను వెనుకను పృథ్వి నల్లెడల
సందియుం బేల నీస్వాంతమ్ము నందు
ఎందుఁజూచిన నాతఁ డుండే కలండు
సర్వమయుండును సర్వాత్ముఁ డయిన
సర్వేశుఁ డాతఁడు సర్వపోషకుఁడు
రావణా ! నీ వైరభావమ్ము మాని
కావింపు మాతని కమలాంఘ్రిపూజ
ద్వారమ్ము వద్ద నీదారిలో నున్న
వీరపూరుషుడె యా విష్ణు" వనంగ.

కలువుపద్ద యెదుట తనకైన డెల్ల

తలఁచి యుల్కాన లేని ధైర్యమ్ము నూని
"చిక్కెను శౌరి నా చేతిలో నటని
నుక్కడగింతు నేనిక్కడే" యనుచు
గ్రక్కున గదఁబూని రావణుఁ డరిగి
అక్కడ నెవ్వరి నరయగ లేక
"పారినాఁడు భయపడి పరువిడి పోయె
తేటు పట్టెద నంచు నరిగె రావణుడు.

---

## రావణుడు సూర్యచంద్రులపై కేగుట

వినువీధి కాంతితో వెలుగుచు నున్న
యినునిపైఁ బడియెను దనుజేంద్రు దృష్టి.
దండెత్తి యంత నాదైత్యనాథుండు
చండభానుని గెల్చి చంద్రుని పయికి
పోరొనరింపంగ పోవుటఁ జూచి
వారించె బ్రహ్మయే వచ్చి రావణుని

---

## రావణ మాంధాతల యుద్ధము

రావణుఁ డంతట రథమమ్ము మీఱి
మీవంశమున రాజు ! చూపించనిగ

మహితకీర్తిని గొన్న మాంధాత యయికి
బహుళసైన్యములతో వచ్చి దండెత్త
ధారుణి కంపించు తీరున సాగె
పోరు ఘోరముగ నాపేరు లిద్దఱికి
అంత పులస్త్యుండు యట కరుదెంచి
శాంతింపఁ జేసె నా సమరవీరులను
తనసాటి యెవ్వరు ధరణి లేరనుచు
దనుజేంద్రునకు దర్ప మినుమడించినది



## రావణుని కొందఱు పతివ్రతలు శపించుట

రణవిహారము సేసి రావణుం డట్లు
తనపురమ్మున కేగఁ దలఁచి మార్గమున
వనిఁ జివన్నాల మేరుపర్వతస్థలుల
బసచేసె నొకనాఁడు బలములఁ గూడి
పరమపతివ్రతల్ వనితలు కొంద
ఱరుగుచుండుటఁ జూచి యాదారి వెంట
పలువురు వీరులఁ బంపి రావణుఁడు
బలిమిని చెరబట్టి వారి నందఱిని
గొనిపోయె లంక కాకోమలు లడలి
వినతిఁ జేసిరి గాని విడువు మటంచు
వారి ప్రార్థన లెల్ల వ్యర్థమై పోయె.

వారంద ఱేకమై వచ్చి కోపమున
"ఏమెఱుంగని మమ్ము నీకిరి నేల
బాముల పాల్జేసి బాధ పెట్టెదవు
పరభామ లనఘోర పాపమ్ము లవియ
జరుపుచుంటివి గాన దురితమ్ము లిట్లు
రావణ ! నీవొక రమణి హేతువుగ
చావు నందెద వని శపించినారు

---

## మేఘనాదుని శివపూజ

రామచంద్రా ! వినుము రావణు పుత్రుఁ
డా మేఘనాదుఁడు నంతటివాఁడె
కడునిష్ఠతో శివక్రతువులు సలిపి
పడయఁగల్గెను పెక్కు వరము లస్త్రములు.
మాయావి యాతఁడు మబ్బుల మధ్య
మాయమై పోరాడు మహిమాన్వితుండు.
శివపూజ నిత్యమ్ము చేయునతండు
శివపూజ పూర్తిగా చేసి యాతండు
సమధికశక్తుఁడై చనుదెంచి నపుడు
సమరమం దెవరును చాల రాతనికి.

జపహోమము లొనర్చి శంభు నర్చించి
విపులశౌర్యమ్ముగ విలసిల్లునట్టి
తనయుని ఘనతను దశకంఠుఁ డెఱిఁగి
మనమున ముదమందె మాటి మాటికిని
సురలను గెల్చెడి శూరుఁడౌ సుతుఁడు
దొరకినందుకు చాల మురిసిపోవుచును.



## రావణుఁడు రంభ నవమానించి నలకూబరునిచే శపింప బడుట

అమరుల గెలువ నాయసురనాథుండు
సమరసన్నాహముల్ సాగించె సురల
దేవేంద్రు నోడింప దేవతాపురికి
రావణుఁ డేగుచు త్రోవలో నాగి
లీలగా నొకనాఁడు కైలాసవనుల
కాలమ్ము నొంటిగా గడపుచు నుండె
అతిలోకసుందరి యగు రంభ యపుడె
పతి నలకూబరు వద్దకేగుచును
కడుదుష్టుఁ డాదైత్యు కంటను బడియె.
చెడుబుద్ధి తోడ యాచెనటి రావణుడు
సురుచిర కోమల శోభనాకార

సురభిళ నవపుష్ప సుందరగాత్రి
రమణీయ కాంత నారంభను గాంచి
అమితకామాంధుఁడై యావెను జేరి
ఎలదీగపై కేగు నేనుగు కరణి
బలిమిమై రంభను బట్టి భోగించె.
విలపించుచును రంభ వేగమే యేగి
నలకూబరునిఁ జూచి తెలిపె సర్వమ్ము
తులువయొక్కఁడు తన లలితాంగి నిట్లు
నలఁగించునే యని నలకూబరుండు
రయమున నరుదెంచి రావణు నాకి
"భయమింత లేక ఓ పాపకర్మకుఁడ !
నీచావునకె యిట్టు లీచానబట్టి
నీచకృత్యమ్మును నెఱపినా వీవు
దనుజ నీకామాంధదర్పమ్ము వీడి
విను మొక్కవాక్య మీవిశ్వమం దింక
నీమీఁద మనసున ప్రేమమ్ము లేని
భామిని నెపుడైన పట్టిన చేని
నీతలల్ పదియు నా నిముసమ్ము నందె
భూతలమ్మున వేయి ముక్కలై పగిలి
పడుగాక యనుచును పటుశాప మిచ్చి
వడచెను రంభతో నలకూబరుండు.

రావణుఁ డొనరించు క్రౌర్యమ్ము లణఁగి
కావర మ్మికనైన కతమట్టు ననుచు
భావించి రానందపరవశు లగుచు
దేవలోకములోని దేవతలెల్ల

---

## దేవ దానవ యుద్ధము
### మేఘనాదుఁడు దేవేంద్రు నోడించుట

తనయుఁడున్ తమ్ముఁడు గల బలమ్ములెల్ల
తనవెంట నిడుకొని దశకంఠుఁ డేగి
ముట్టడించెను తాను ముందుగా నిలచి
అట్టహాసముతోడ నమరేంద్ర పురిని.
దైత్యేంద్రుసేనలు తమ కడ్డు లేక
నత్యంతదర్పులై యమరలోకమున
మూలముట్టుగ దృష్టి పోయిన వఱకు
గాలించి ధ్వంసమ్ము గావించినారు.
లేశమున్ వదలక లేదిగ నైన
నాశమొనర్చి రా నందన వనిని
దానవబాధకు తాళఁగ లేక
తానక చేతోక కర్తవ్య మెదను
సురపతి మనమున వెలంగది మిగుల
మొఱపెట్టుకొని వచ్చె హరివద్ద కేగి.

సమధికబలములతో సాహసు లగుచు
అమరవీరు లెదిర్చి రసురసైన్యముల
బిరుదుబంటుతనంపు బీరమ్ము లలర
ఇరువర్గముల సేన లెగసి పోరాడు
దేవదానవయుద్ధ తీవ్రసంక్షోభ
పావకజ్వాలలు భగ్గున మండె
దశకంఠు ధాటికి తాళంగ లేక
దిశల పర్విడి రెల్ల దేవతాగణము
మేటివీరుం డగు మేఘనాదుండు
మాటిమాటికి వచ్చి మాయయుద్ధమున
తనశక్తి నెల్లను వినియోగపఱచి
కనుపించు సురలను కసిమసంగుచును
ఒక్కమారుగ సేన నుక్కాణాపఱచి
ఉక్కుమీఱంగ వచ్చి యుగ్రరూపమున
దేవేంద్రుపై నేగి తీవ్రయుద్ధమ్ము
గావింపఁ దలపడె కడుసాహసమున
ఐరావతము నెక్కి అమరులఁ గూర్చి
ధీరుఁడై పోరెను దేవేంద్రుఁ డచట
ఎదురయి రణ మొనరింపగా లేక
చదల మబ్బుల డాగి శక్తిని విసరి
దేవేంద్రు బంధించి రావణు కడకు
రావణాత్మజుఁ డేగె రాణ దీపింప

అమరేంద్రు గెలిచిన యాత్మజుఁ గాంచి
యమితహర్షమ్మున నలరె రావణుఁడు
దానవేంద్రు నెదుర్చు ధైర్యమ్ము లేక
దీనులై తొలఁగిరి దేవత లెల్ల
దనుజులు సంతోషతత్పరు లయిరి
పెనుబొబ్బ లిడుచును విజయగర్వమున.

---

## బ్రహ్మదేవుఁ డింద్రుని విడిపించుట

ఇంద్రు వంతటివాని కింత చేటొదవె
ఎందుఁ గోద మటంచు ఋషులు దేవతలు
వినిపించి రార్తులై విధియొద్ద కేగి
దనుజు లొనర్చిన దారుణమ్ము లను.
రావణుకడ కేగి రయమున బ్రహ్మ
రావణా గెలిచినా వీవు దేవతల
భవదీయ రణశౌర్య పాటవోన్నతులు
భువనమ్ములం దెల్ల పూర్తిగా తెలిసె
నాకేశు గెలిచిన నీకుమారుండు
విశ్రుత రణవీరుఁ డింద్రజిత్తనఁగ
విలసిల్లు కీర్తితో నిలమీఁద ననుచు
పలుమారు వినుతించి వరముల నొసఁగి

మెరుక కా యుగ్రుని విశిపించి పంపె
మునులును దేవగణ మోదమ్ము నందఁ



## హరి యవతారమగు కపిలుని గని
## రావణుఁడు వెఱగందుట

శ్రీరామ వినుమొక చిత్రమహాగాథ
ఆ రావణుంగూర్చి ధారుణి నున్న
దని యగస్త్యుఁడు చెప్ప నామోద మలర
వినుచుండె రాముఁడు వినయుఁడై యిట్లు
"విబుధుల గెలిచిన విజయమోదమున
ప్రబలుఁడై లంకకు వచ్చి రావణుఁడు
జలనిధి తీరాన సంచరించుచును
తిలకించె నొకట నా దితిజనాథుండు
పరమతపోనిష్ఠ పద్మాసనమున
వరలుచుండిన మహా నివర్యు నొక్కనిని
అతని మొగమ్మునం దఖిలలోకమ్ము
లతికాంతితో వెల్గు టరసి రావణుఁడు
హానిగా దీతఁడు మాయలా డనుచు
బాణములే మునిపైన వర్షింపసాగె
ముని యుగ్రుఁడై లేచి దృష్టిపాతమున

దనుజునేయ నతండు ధరణి మూర్ఛిల్లి
తెలివంది యాగ్రహోద్దీప్తుఁడై మరల
విలునమ్ములను బూని విక్రమం బతర
మునినిఁ బోసియను దునిమెద ననుచు
మునియున్న దెసకును చనుదెంచి వడిగ
కడువిస్మితుం డయి కాంచె నచ్చోట
ఎడదలో నొకకొంత దుడుకు జనింప
శతసంఖ్యగా నున్న శస్త్రాస్త్రధరుల
నతుల తేజమ్ముతో నలరు వారలను
లలితరూపుల దివ్యలావణ్యవతుల
విలసిత మునులను వివిధదేవతల
దనుజగణమ్ముల మనుజసంతతుల,
మనమున నాదృశ్యమునకు భీతిల్లి
వారికావల నొక్క వాత్సల్య నిధిని
భూరిసౌఖ్యమ్ముల పొలుపొందు వాని
బాల యొక్కతె తనపాదమ్ము లొత్త
తూలికాతల్పాన లీలగా నున్న
సరుచిర సుందర శోభనాకారు
పురుషు నొక్కనిఁ జూచె మరల రావణుఁడు.
తనదృష్టి సర్వ మాతన్విపై నుంచి
దనుజేంద్రుఁడును కామదగ్ధుఁడై మిగుల

నాకేల భయమని యాకాంతస్థి పు
ష్కరమై వడివడి వెడలుచుండంగ
ఆదివ్యపూరుషుం డసురేశుఁ జూచి
మేదిని యెల్లను భేదిల్ల నొక్క
అట్టహాస మొనర్చి నాధ్వని కదరి
యట్టి యారావణు డవనిపైఁ గూలె

తెలివొంది నిలచి యాదివ్యపూరుషుని
కెలమి నమస్కృతుల్ సలిపి రావణుఁడు
"సురుచిరాకార! యో పురుషవరేణ్య!
యెఱుఁగలేకుంటి నీ వెవరవో యిచట
దశకంఠుఁడను నేను దనుజాధిపతిని
దిశలెల్ల గెలిచిన ధీరుఁడ నేను
అవనిపైఁ బడితి నీయట్టహాసమున
కెవరవో దయయుంచి యెఱిగింపు" మనఁగ
"ఓ రావణా! నేను నారాయణుండ
నారూప మెఱుఁగంగ నేర వీవనుచు
శతకోటి తీక్ష్ణాంశు జాజ్వల్యమాన
వితతతేజమ్ముతో వెలుఁగుచు నాతఁ
డంతర్హితుండయ్యె నాదశగ్రీవుఁ
డంతయు శూన్యమై యాశ్చర్య పడఁగ.

కపిలర్షిగా నున్న కమలనేత్రుండె
యజ్ఞమట్లు గన్పించె సగరనాథునకు.
ఆ విష్ణుమూర్తియు నాకపిలుండు,
ఆ విశ్వరూపము నీవె శ్రీరామ!
నీ తేజ మొకయింత నీవిక్రమమును
దైతేయపతి కట్లు ధరణిఁ జూపితివి.
వినుమయ్య తరువాతి విషయ మటంచు
వినిచె రామున కిట్లు మునియగస్త్యుండు

---

## రావణుఁడు సనత్కుమారుని జూచుట

ఆదివ్యపూరుషు నాతని తేజ
మాహాత్మ్య మంతయు నాగ్రహలోఁ దలఁచి
చలితుఁడై తనకట్టి శక్తి లేదనుచు
తేఁచి చిత్తమ్మున ధైర్యమ్ము విడలి
కాంశక్తి కీభువి నడ్డు లేదనుచు
వెఱగంది దానవవిభుఁడు శ్రీరామ!
"మును హిరణ్యాక్షాది దనుజాధిపతులు
చనిపోయి రాహరి శక్తికి లోఁగి
మెచ్చిన విష్ణుచే మెచ్చంగవలయు
చచ్చిన నతనిచే చావంగవలయు

వైరముచే నైన వైళము హరిని
చేరదననుచు చిత్తమందెంచి
తనతలంపుల నంత దనుజేంద్రుఁ డేగి
మనవిసేసె సనత్కుమారుని వద్ద
దనుజేశు రాకకు ముని సంతసించి
వినిపించె నిట్లని విష్ణుని మహిమ
"హరిని సామాన్యుగా నాత్మలోఁ దలచి
తిరుగుచుంటివి నీవు దైతేయరాజ!
హరి యఖిలేశుఁడు హరికృపామయుఁడు
హరి యనంతుఁడు నిత్యుఁ డఖిలరక్షకుఁడు
నీకోర్కె రావణా నెఱవేరు నింక
వైకుంఠమునుండి వచ్చి మాధవుఁడు
వేలుపు లర్థింప పృథ్వి జనించు
నేలపై ధర్మమ్ము నిలుపుట కొఱకు
ఇనకులమందున కృతయుగాంతమున
మనుజుఁడై శ్రీరాము డనెడు నామమున.
రాముఁడు క్రూరులౌ రాక్షసతతుల
తామున మడగించి ధర్మమ్ము నిలుపు
రామునిభార్యను రావణా! నీవు
భూమిజన్ బ్రుచ్చిలి రామునితోడ
వైరమ్ము సాగించి ఘోరయుద్ధమున

శ్రీరామచంద్రుని చేతిలోఁ జచ్చి
వడిగ చేరెదవిక వైకుంఠపురము
వెతలును నీకింక విడిచి యసంగ
ఇనవంశమున రాము వెవ్వఁడు జన్మించి
తవకు దర్శన మిచ్చి ధన్యుని జేసి
తనను రక్షించునో యని వేచియుండి
కొ/ పోయె సీత నాదనుఁజుఁడు రాము!

నీవె శ్రీహరివంచు నీచేఁ లోన
ఛావుసందుట కయి రావణు డటుల
జనకజన్ ముచ్చిలి చెవటికార్యమ్ము
మనమున నెంచిగిదే యొనరించె గాని,
పుడమిపై జనులెల్ల నుడివెడు నంత
కడుమూర్ఖుఁ డెవ్వఁడు గాఁడు రావణుఁడు

రామచంద్రా ! యిది రావణుచరిత
భూమి నీవెఱుఁగని దేమియు లేదు.
సనకసనందుల శాపమ్ము వలన
దనుజరూపముల నీద్వారపాలకులు
రావణకుంభకర్ణాసురు లనఁగ
భూవలయిమ్మున పుట్టిరి తుదకు
సమరాన నీచేఁ జచ్చి వైకుంఠ

విమలధామమునకు విచ్చేసినావు.
వైరుల నైనను వదలిపెట్టక యె
కారుణ్యదృష్టితో కాపాడినావు,
పుడమిని నీవయి పుట్టి శ్రీహరివి
అణఁగించి సర్వ మాయసురుల బాధ
ధరణిపై స్థిరముగా ధర్మమ్ము నిలిపి
మరల కిచ్చినమాట నెఱవేర్చినావు.
జనులకు మునులకు జగతి కంతటికి
ఘనమైన యుపకృతి గావించి నావు
పరిపాలనోన్నత పరమార్థ మెఱిఁగి
ధర నేలుచుంటివో ధర్మస్వరూప,
రామరాజ్య మ్మిక క్షేమరాజ్య మగు
భూమిని స్థిరముగా పొలుపారు ననుచు
వినుతించె రాముని మునియగస్త్యుండు
తనవెంట వచ్చిన మునులతోఁ గలసి,

---

## ఆంజనేయుని చరిత్ర

ముని యగస్త్యుం డంత హనుమంతుఁ జూచి
"వినుమయ్య రామ ! నీ యనుచరులందు
ప్రతిలేని సాహస ప్రాభవశాలి
అతులితబలుఁ డీ యాంజనేయుండు,

నిన్నె దైవమ్ముగా నెమ్మది నిలిపి
మన్నించి సేవించు మహితవర్తనుఁడు
రాక్షసు లందఱిన్ శిక్షింపఁ జాలు
అక్షయ్య సత్త్వ ధీయు నిలనందనుఁడు.
కపివీరునకు నీకుఁ గలిపె స్నేహమ్ము
విపులాబ్ధి లంఘించె వీఁడై యొకఁగి
కనుఁగొనె జానకిన్ కాల్చెను లంక
కొనివచ్చె సంజీవి ఘనలక్ష్మణునకు
వినుతింప శక్యమే హనుమంతు ననుచు
వినిపించె మునియిట్లు హనుమని చరిత.
హనుమంతుఁ జూచుచు నాదర మ్మొప్ప
వినుచుండె రాముఁడు ముని చెప్పు కథను.

తొలిజన్మమందు నీ సలలితమూర్తి
ఇల నేకపాదుఁడై వెలసిన హరుఁడె
కేసరి కిల నంజనాసతి యందు
వాసిగఁ బుట్టిన వానరోత్తముఁడు
ఆ యంజనయు భక్తి ననిలునిఁ గొల్వ
వాయునంశను బొంది వసుధాతలాన
ఆంజనేయుఁడు బుట్టె హరుతేజమలర
అంజనాదేవికి నతిశయబలుఁడు.
పుట్టుకతోడనే భూరి సాహసుఁడు

పట్టుపిడిని మహాబలశాలి యితఁడు.
హనుమంతుఁ డాకలిఁ గొనె నందుఁ దలఁచి
జననియు పండ్లకై వనమున కరుగ
అభయుఁడై యెగిరెను పథమున కితఁడు
ప్రభవించు భానుని పండుగాఁ దలఁచి
జగదుపకారిగా సామీరి సాఁగి
మిగులచల్లగ నయ్యె మింట సూర్యుండు.
తాను గ్రసించెడి భానునిపైకి
వానరుఁ డేగుట భరియింప లేక
రవిని బట్టగ వేగ రాహువు రాగ
రవిబింబమును వీడి రాహువుపైకి
నల్లనివాడని యుల్లమ్ములోన
ఉల్లాసమొప్పంగ నురికెను హనుమ
ఇరుఁడను భయమంది ఇంద్రునిఁ జూచి
వినిపింప హనుముని విక్రమ క్రమము
హనుమంతు సాహస మెంచుకొనుచు
చనుదెంచె నింద్రుండు తనకరి నెక్కి
ఐరావతము మీద నాగ్రహమ్మెసఁగ
పోరికై దూకె నీ వీరమారుతియు
తెంపు దీపింపగా దేవేంద్రుఁ డపుడు
పంపెను హనుమపై వజ్రాయుధమును
చెక్కిలి తెగటచే శితవజ్రహారిని

గ్రక్కున మూర్ఛిల్లె నక్కడే హనుమ.
తనయు నార్తిని జూచి కినుక వహించి
తన ప్రసారము నెల్ల స్తంభింపఁ జేసి
అనిలుఁడు గొంపోయి హనుమంతు నెత్తి
తన నివాసము నందు తగురతిఁ జేసె
ప్రాణమ్ము నిలిపెడు వాయువు లేక
ప్రాణభయమ్మున ప్రాణు లల్లాడ
జగతి కీ యాపద తగదని తలఁచి
తగ నుపాయముతోడ తప్పింప నెంచి
పవనుని కడ కేగి బ్రహ్మాదిసురలు
సవినయ చిత్తులై సంస్తుతిఁ జేయ
జగమున వీచగా సాగెను గాలి
వగమాని ముదమందె ప్రాణిసంతతులు.

హనుముఁడు పసిబాలుఁ డయ్యును గూడ
వినువీథి కెగసిన ఘనతను పొగడి
ఇనుఁడును బ్రహ్మయు నీశుఁడు యముఁడు
ననిమిషేంద్రుఁడాది యమరులు వచ్చి
వరము లొసంగిరి పావని కపుడు
నిరుపమబలుఁడును చిరంజీవి గాగ
తన ప్రాభవమునకు తనబలమ్మునకు
మనమున నతిశయ మానుపది లేక

ఇరువద్ద కలితభక్తి నేగి పఠించి
ఘనమయు వేదమ్ము లఖిలశాస్త్రములు
నీతిపారంగుడును నియమనిష్ఠుండు
ప్రీతితో వైరాగ్యవేత్తయు నగుచు
దేవదేవుండ వని భావించి నిన్ను
సేవించుచున్నాడు శ్రీరామ యిపుడు

హనుమచ్చరిత మిది యనఘ శ్రీరామ
జనులకెల్లను సర్వసంపత్కరమ్ము.



## వాలి సుగ్రీవుల చరిత్రము

వాలిసుగ్రీవుల ప్రఖ్యాత కథయు
వాలించె రాముఁ డిట్లాముని నుడువ.

"కనకాద్రిపై బ్రహ్మ గాఢసమాధిఁ
గొనియున్న సమయాన కనుగవలోన
నానందబాష్పమ్ము లలరె, నందుండి
వానరాకృతితోడ ప్రభవించె నొక్క-
నందనుం డా బ్రహ్మ నయనమ్ములకును
బిందుసేయుచు ఋక్షవిరజుం డనంగ.

నిరతమ్ము శతశంద్రి నియమించి నటుల
తిరుగుచుండెను ఋక్షవిరజుఁ డాగిరిని.
గిరిదరి నొకనాఁడు తిరుగుచు వరఁడు
సరసి నొక్కటిఁ గని స్నానమ్ము లాడ
ఋక్షునిమునకమ్ములో మాఱి రూపొంది
తరుణ యౌవని యైన తన్విగా నచట.
ఎలబ్రాయపుం జెల్వు లింపులు నింప
విలసితగతి నాఁడు విహరించుచుండ
ఆమార్గమున నేగు నమరేంద్రసూర్యు
లాఁడు మైసోయగ మాఁడు యాకృతిని
గమనించి వలచి రాక్షణములో వారి
తమకమ్ము తీర యాతన్వి దేహమున
వాలమ్ముగలచోట వాసవుశక్తి
రాలిన యంతనే వాలి జన్మించె
ఇనుని తేజము నిల్చి యుంటి కంఠమున
జనియించె సుగ్రీవు డనునొక సుతుఁడు
వానరాక్కుల బలప్రాభవమ్ములను
వాసిగానందిరి వార లిర్వురును.
వాసవుఁ డిచ్చెను వాలి కత్యంత
భాసురమహిమకా స్వర్ణహారమ్ము.
సురుచిరతేజమ్ము సుగ్రీవునకును
వరముగా నొసగి తా నరిగె సూర్యుండు.

తమతండ్రుల వరమ్ము లమరంగ నంది
అమితబలాఢ్యులై యలరిరి వారు
వనజసంభవు నాజ్ఞఁ గొని యాలతాంగి
తన సుతు లిద్దరిన్ తనవెంటఁ బెట్టి
చేరెను వానరసీమగా ధరణి
కీర్తిఁ గొన్నట్టి కిష్కింధకడకు
విమలాంగి తారను పెండ్లాడె వాలి,
రుమను పెండ్లాడెను కమలాప్తసుతుఁడు
అనుజుఁడు సుగ్రీవుఁ డతినీతిపరుఁడు
వినయుఁడై కొలుచుచు తనవద్ద నుండ
వానరరాజయి వాలి శోభిల్లె
మానిత బలసత్త్వ మహిమమ్ము లెసఁగ
తనపైకి వచ్చిన దశకంఠుఁ బట్టి
వననిధిఁ ముంచిన బలశాలి వాలి.

తరువాత రామ! ఆ యిరువురి మధ్య
జరిగిన కథ సర్వమెఱుగుదు వీవు
తమ్ముని భార్యను తాను చేబట్టి
తమ్ముని బయటకు తరిమిన వాలి
దురితమ్ము నెల్ల నీ వెఱిగియే రామ!
పరిమార్చి నావాక్కు వాడి బాణమున
కరుణతో సుగ్రీవుఁ గాపాడి నావు

నిరుపమానము రామా! నీ బాహుబలము
నిరుపమానము రామ! నీకృపాగరిమ
అని యగస్త్యుఁడు రాము నతిభక్తితోడ
వినుతిఁ జేసి ముగించె తనభాషణమ్ము

---

## అగస్త్యాది మునులకు రాముని వీడుకోలు

ముని యగస్త్యుఁడు తక్కుమునులతో లేచి
వినయుఁడై శ్రీరామవిభునకు మ్రొక్కి-
"శ్రీరామ! భూమిపై శ్రీహరి వీవు
ధారుణీసుత సీత శ్రీరమాదేవి
సలలిత ధర్మమున్ జగతి కంతటికి
తెలుపంగ వచ్చిన దేవతల్ మీరు,
ఆదర్శమానవు లవనిపై మీరు
ఆదర్శజీవిత మ్మవనిపై మీది.
ధరణి నెల్లరకు మీపరిపాలనమ్ము
చిరతరానంద సంక్షేమ దాయకము.
ఈమహి మిమ్ముల నీక్షించి యిచట
మేము ధన్యుల మైతి మోమాన్యచరిత!
శ్రీరామ మా కిక సెల విమ్మనంగ
శ్రీరాముఁడును లేచి వారికి మ్రొక్కి-

అనురాగ మెప్ప నామునులకెల్లరకు
వినుతసత్కారముల్ చేయ నొనర్చి
ప్రియభాషణమ్ముల వీడుకోలొసంగ
పయనమై యేగిరా పరమసంయములు

---

## బంధుమిత్రులకు శ్రీరాముడు తన కృతజ్ఞతను తెలుపుట

సురుచిర సామ్రాజ్య శోభదలిర్ప
మఱునాడు రాముఁడు మహనీయరీతి
పేరోలగమ్మున చేరి కొల్వుండ
ధారుణీపతు లెల్ల తగురీతి గొలువ
మునులు పురోహితుల్ వనచరవరులు
తనమంత్రిసత్తముల్ దండనాయకులు
పౌరముఖ్యులు సర్వబాంధవజనులు
వారివారలచోట్ల వచ్చి కూర్చొనిరి.
రాముఁడు రాజాధిరాజుగా వచ్చి
భూమినిఁ బాలించు పుణ్యభాగ్యమును
తానఁగల్గితి నంచు మేను లుప్పొంగి
ఆనందపులకితు లైరి వారెల్ల
మునులకు మునుముందు మ్రొక్కి పూజించి

వినయుండై యేతెంచి పెద్దలకెఱఁగి
తనరిన కూర్మితో తక్కినవారిఁ
గనుఁగొని రాముఁడు కరములు మోడ్చి
"మీ యనుగ్రహమున మీ యాదరమున
నాయత్న మెల్లను శ్రేయమై ముగిసె
ప్రజలను పాలించు బాధ్యత నాదు
భుజముల నున్న దీపుణ్యకార్యము
నొనరింతు నాశక్తి కనువుగా" ననుచు
తనకృతజ్ఞత తెల్పె వినయవాక్యముల
జనులంద ఱాతని సౌమ్యతన్ బొగడ

శ్రీరాముఁ డంతట చెలిమికై నచట
చేరిన వారల క్షేమ మెఱింగి
జనకభూపతికిని తనబంధుతతికి
వినుతసత్కారముల్ ప్రీతి నొనర్చి
అంగదున్ సుగ్రీవు నఖిలవానరుల
చెంగటకును బిల్చి స్నేహాన పలికి
జాంబవంతుం డాది సకలవృద్ధులను
సంబరమ్మున తన సరసకుఁ జేర్చి
అల విభీషణు బిల్చి యాదరమ్మెసఁగ
సలలిత సద్భావ సంతోష మలర
తగను వారొసఁగిన ఘనసహాయమును

మనమున నెన్నఁడు మఱవలే ననుచు
భూరినమస్కారముల్ పొలుపారఁ జేసి
పేరుపేరునఁ బిల్చి వీడ్కో లొసంగె.

మానసమ్మున రాము మహిమమ్ముఁ దలఁచి
యానందబాష్పమ్ము లలర నేత్రముల
శ్రీరామునకు మ్రొక్కి సెలవు గైకొనుచు
వారంద ఱేగిరి వారియిండ్లకును
హనుమంతుఁ డిల తను గొనరించినట్టి
అనుపమ సాహాయ్య మాత్మలోఁ దలఁచి
మహితముక్తాంచిత మణిహార మొకటి
బహుమానముగ సీత పావని కిచ్చె
హనుమంతుఁ డామాల నరుత ధరించి
వినుత తేజస్వియై విలసిల్లె మిగుల
అనిశమ్ము శ్రీరాము సంప్రములసేవ
నొనరించు చుండెనే హనుమంతుఁ[illegible]

---

## రా మ రా జ్య ము

తనసహోదరులును హనుమంతుఁ[illegible]
తనసజ్జనే నిల్చి తగుసేవ లీయ,
భూమివాసుల మేలె పుణ్యాశయముగ

రాముడు పాలించె రాజ్యపాలనము
ధనదుండు వినయుండై తనకాన్కగాగ
తనపుష్పకవిమాన మనిపె రామునకు
రాముండు రాజయి రాజ్యమేలంగ
భూమినమస్తము పొల్పెసలారె
సకలసంపదలతో శాంతిసౌఖ్యముల
సకలవిధమ్ముల జనులు వర్ధిల్లి
సముచిత సద్ధర్మ సంపద్విలాస
రమణీయమై యొప్పె రామరాజ్యమున
ఘోర రాక్షస రోగ దారుణ క్షామ
భారముల్ నశియించి ధారుణి యలరె
నరవిని శ్రద్ధతో సహజధర్మముల
జరుపుచుండిరి జనుల్ సర్వవర్ణముల
గో దేవ బ్రాహ్మణ గురుపూజ లలరె
మోదమ్ము నిండారె మునియాశ్రమముల

మానవమాత్రుండై మహిఁ జరుదెంచి
మానవధర్మమ్ము మహిఁ జూపించి
దుష్టుల శిక్షించి దుర్మార్గ మణచి
శిష్టుల రక్షించి శ్రేయమ్ము నెఱపి
న్యాయమ్ము నీతియు నయవర్తనమ్ము
పాయని సద్ధర్మపాలకుఁ డగుచు

వైకుంఠుఁడే వచ్చి వసుధఁ బాలింప
లోకమ్మునం దిక లోటు లేకుండు !
రాజిల సుఖశాంతిరాజ్యమై వెలసి
రాజలోకమునకు ప్రజలకెల్లరకు
ఆదర్శమై భువి కానంద మగుచు
మేదిని కెల్లను మేలౌన గూర్చు
రామరాజ్యమ్మది భూమి కందమ్ము
రామరాజ్యమ్మది ప్రజల భాగ్యమ్ము
ధర్మచక్రమున కెల్లసంపద లొసఁగి
ఆచంద్రతారార్క మాదర్శ మగుచు
భూమి నెల్లరు గూడ పొగడంగఁ దగిన
క్షేమరాజ్యమ్మది రామరాజ్యమ్ము
పదునొక్కవేలేండ్లు వసుధ నేలిల
సదయుఁడై శ్రీరామజననాథుఁ డేలె.

---

## సీతారాముల వనవిహారము

కాలూని నిలువక క్షణమాత్ర మైన
కాలచక్రమ్ముల కదలు చుండంగ—
క్రొంజిగురాకులఁ గోయిలతోడ,
మంజుల పవమాన మార్గమ్ములందు

క్రొత్త పువ్వులతోడ నెత్తావితోడ,
మత్తిల్లి తిరిగెడు మాధువమ్ముతోడ
వచ్చె వసంతమ్ము వసుధ కంతటికి
తెచ్చెను చల్లని తీయని వెలుఁగు
ప్రతివత్సరము వచ్చు వాసంతవేళ
లతిమోహనముగ నగుపించె నపుడు.
ఆనందభరితమౌ నమరత్తు లలరె
జానకీరాముల మానసమ్ములను.
అల్లన వారిద్ద రరిగి రావేళ
నుల్లాస మొనరంగ నుద్యానవనికి
మావిగున్నల నల్లు తీవెఁ జూచి
తీవ తీవకుఁ బూచు పూవులఁ గాంచి
పూవులు విరజిమ్ము తావుల నాని
మలయానిలమ్ముల మలఁగి మలఁగి
పులుగజంటల తీఁయపలుకు లాలించి
చెలువంపుఁ బూబోద గలువపూదిగుల
కలవోఁగా నేగి యందందు నాగి
మనముల నన్యోన్య మధురానురాగ
మినుమడింపగ రమ్యవనవిహారములఁ
దినగుచు నందొక్క సరసిఁ జేరి
సరసజలక్రీడ లిరవుగా సలిపి

లీలగా బ్రణయోల్లసులై యచటి
కేళీగృహమ్మున కేగిరి వారు.

మెలమెల్లగ దిగి మింటిపైనుండి
చలువవెన్నెల వెండివెలుగు జాల్వారి
ఆ యమునల బాట లావున్నదోట
లా యామినీవేళ లందమ్ము లయ్యె
సీతయు రాముఁడు శృంగారవిభవ
చేతనామూర్తులై చిత్రమ్ములందు
వలపులు నిండిన తలఁపు లింపరు
విలసితాకారులై విహరించి రచట
తన గృహస్థాశ్రమ వినుతధర్మమ్ము
తన రాజనీతియు తప్పకుండంగ
పడఁతి సీతను గూడి కడుసంతసమున
గడపెను రాముఁడు కాల మీరీతి



## సీత మునితపోవనములఁ జూడగోరుట

ఆనందముగఁ బ్రాకె నంతలో పురిని
జానకి గర్భిణి యైనట్టి వార్త
ధరణీశుం గనుగొని తమమానసముల
మురిసిపోయిరి చాల ముప్వురత్తలును

రమణిసీతను జూచి రాముఁ డుప్పొంగె
అమితసమ్మోదమ్ము నందిరి ప్రజలు.

అలరారె నవనిజ కంతకంతకును
పొలుపగు చెక్కుల్ తెలతెల్ల నగుచు
నడలు మందములయ్యె బడలిక హెచ్చె
నడుము భారమ్మయ్యె కదలె ధైర్యమ్ము.
వడలక రామునివద్దనే యుండ
మది నిచ్చగించు నామానిని సీత
తీరని మమతతో సారె సారెకును
కోరిక లేవేవొ కోరుచునుండు
వెనుక తానొకనాఁడు వెడలినవనులు
మునితపోవాటికల్ మునిపత్నులెల్ల
కనులలో కదలిన ట్లనిపించి మరల
కనుఁగొన నెంచి యా మునివనుల్ సీత
వేగమ్ము తనవాంఛ విభునకుఁ జెప్పె
పోఁగాక యని రాముఁ డల్లన నవ్వె.

ఒకవిరాగము తన యుల్లమ్మునందు
ప్రకటమైన విధమ్ము పైకిరానీక
సీతను ప్రేమతోఁ జేరి రాఘవుఁడు
ప్రీతితో మాట్లాడి ప్రీతితోఁ జూచు

శ్రీరాము నాత్మలో చెలరేగు మన్న
వైరాగ్య మింకైన ధారుణీజాత
యెఱుఁగంగలేక తా నవ్వేడియల్ల
తిరుగుచునుండె నే యరమరి లేక

---

## శ్రీరాముఁడు సీతను త్యజించుట

కడుసంతసమ్మయి కాల మీరీతి
పురమునఁపై వారికి గడచుచు నుండ

లోకులు కాకు లేతేకువ లేక
వాకొంద్రు నోటికి వచ్చిన యట్లు
పరవాసమం దొకవత్సర మున్న
తరుణి సీతను దెచ్చి మరల శ్రీరాముఁ
డేలుచున్నాఁ డంచు నపటనో యెవఁడో
యాలోచనము లేక అనినట్టి మాట
వినవచ్చె రాముని వీనులయందు
సునిశితశూలమ్ముల్ జొనిపిన యట్లు.
జనకజ దూకిన జ్వాలదగ్నిశిఖలు
తనకన్నులందుండి తరలనే లేదు
సీత పాతివ్రత్యశీలమ్ము నెల్ల
వీతిహోత్రుఁ డెఱుంగు విశ్వ మెఱుంగు

కాని లోకులు పల్కు నీవాక్యముల
మనసార వినుచు తా నుల్లమ్ము నంపు
సైరింపఁ జాలఁక క్షణముగ రాముండు.
కాని యట్లున్నచో ధర్మమే యగును,
కాని యట్లున్నచో ధరణి యేమనును!
ఎదయందలి ప్రేమ నల్ల నణంచి
తనయొక్క తన రాజధర్మమ్ము నెంచి
జనులాడు నపనింద సైరింపలేక
తనసీత నొంటి బాయఁ దలఁచె రాఘవుఁడు

మోహమున నొకచింత క్రమ్ముకొనంగ
సౌమిత్రి కెఱిఁగించి జరిగిన దెల్ల
అడవిలో వాల్మీకి యాశ్రమస్థలిని
కడువడి సీతను విడచిరమ్మనుచు
వాదమ్మునకు తావు వదల కావంత
ఏమిది ఏమిది యెంత ఘోరమ్ము
భూమిజన్ ద్యజియింప రాముఁడు తలఁచె
రాముఁడే పలికెనా యీమాట లెల్ల
సౌమిత్రి కడయించె సందియ మ్మేదో.
రాముని యాజ్ఞలో రగులు తీవ్రతకు
సౌమిత్రి నిలువున చలియించిపోయె
పిడుగులు తలమీద పడుచున్న రీతి

నెపమగో లక్ష్మణుం డెంచెను గాని
రాముని మాటకు రాగూడ దడ్డు
రామాజ్ఞ మీరంగరాదు ధారుణిని.
మాటురాఁడై లక్ష్మణుఁ డరదమ్ము తెచ్చె
నడుగగా నడవుల కవనిజం గొనుచు
తనకోర్కె రాముఁడు విని తీర్చె ననుచు
జనకజ యుప్పొంగి సంతోష మమర
వనికేగ వెంటనే బయలుదేరినది
వెనుకకు దినములో చనుదెంచు ననుచు.
అడుగు చేయూతనందిచ్చి నంప
రాఘవు నటకు రాఁడేల యనుచు
తోఁచనే దుఃఖ బాధ తోఁచె జానకికి
చూడినట్లయిగుండె శూలమ్ము గ్రుచ్చి
పటికోత బాయములు వసపెత్త రథము
కడుదూర మింగ గాఁ గనచిపోయినది
ఏచక్కి జనకజ నగా వివప్పెకి
తోఁచెను విపరీత దుర్నిమిత్తములె
చాటునఁ గూర్చుండి చనుదెంచుఁ గాని
మాటాడఁ జేమియు మాఱది లక్ష్మణుఁడు
ఎదుల కీకోర్కె యొక దుర్భవించె
ఎందుల కీవని కేఁగించె రాము
తగ్గకో లని తపనగొ నిండి

కొట్టుకొనసాగెను గుండె జానకికి
అడవిదాపులఁ బట్టి నడచి యారథము
కడువేగ చేరెను గాంగతీరమ్ము
దిగ లక్ష్మణుండును దిగెను మాతలియు
దిగి ఏదో తెలియని దిగులుతో సీత
"ఏమయ్య లక్ష్మణ! యేమైన దోయి
ఏమి దీనుఁడవయి యిట్లుంటి వనియె
విఱిఁగిపడ్డది మిన్ను శిరమున నంచు
నెఱుఁగదు పాప మాయింతి సీతమ్మ
చెప్పకపోలేక చెప్పగా లేక
తప్పించుకోలేక తలమీది బరువు
వదపఁజూత్రగలేక వాల్చి లక్ష్మణుఁడు
వదినకాళ్ళకు మ్రొక్కి వచియించె నిట్లు

"ఓయమ్మ జానకి! ఓ మహాసాధ్వి!
నాయందు దయబూని నన్ను క్షమింపు,
శ్రీరామునాజ్ఞను మీటగా లేక
ఘోరమంచును నాడు స్వాంతమం జెఱిఁగి
కొనివచ్చితిని నిన్ను వనవీధి కిటుల
వినిపింపగా నొక్క వెసిదావు వార్త.
పరవాసమందున్న పడతి జానకిని
మరల రాముండేలె ధరణి నటన్న

పరు లాడుచున్నట్టి పరుషవాక్యములు
భరియింపఁగాలేక పరితాపమంది
రాముఁడు వేగమె రమణిరో! నిన్ను
నిమహాటవిలోన నేకాకి గాగ
విడచిర మ్మనఁగ నిన్నడవి కీరీతి
తనయుఁడ తెచ్చిన కడుపాపి నేను,
ఈకానన మ్మెడ సాకేత మెడ
ఏకాకివై యిచ్చ నెటులుండువమ్మ !
ఎవరు సఖిజను లెవరు బాంధవులు ?
ఎవరు దిక్కిచట నీకెల్లవేగదవా
పరనింద వినలేక వదలెనే కాని
యెఱుఁగఁడే శ్రీరాముఁ డెదలోన నిన్ను,
దారుణారణ్యమే తల్లి! నీయిల్లు
కూరిమి చుట్టాలు క్రూరజంతువులె
అనియేమొ లక్ష్మణుం డనువాక్యములు
వినలేక జనకజ విస్మృతిం గొనియె
వ్రేలినవా వేయిపిడుగులు తలను!
వ్రీలినదా క్రింది పృథ్వీతలమ్ము!
తలగొట్టినట్లయి తాలిమి తూలి
నేలను నిండిన తల్లి నిడుదూలాలు
"నాతల్లి భూదేవి ననుగావు మనుచు

భూతలమ్ముపైఁ బడి సీత మూర్ఛిల్లె
తెలివొంది లక్ష్మణుం బిలిచి దీనముగ
పలుకుల్ల నిట్లని పలికె జానకియు
కనులందు నశ్రువుల్ కాల్వలై పార
తనువెల్ల వణఁకుచు దురదశ లావ.

"వినవయ్య లక్ష్మణ! వినవయ్య తండ్రి
ఇనివడి నాకేమి వసుధపై మిగిలె,
నారాముఁడే యిట్లు నన్నుఁ ద్యజింప
ధారణి నన్నింకఁ దలఁచువారెవరు!
విడలేక రాముని వెన్నంటి యేగి
అడవులఁ దిరిగితి నగ్నిదూకితిని
చాలవు గ బోలు జగతి నీపాట్లు
ఆలింపు లేవడింక పాలింపు లేవరు.
నాకిఁక యిటులుండ నీవేల తడయ
వేవేగ లక్ష్మణా వెనుకకు బొమ్ము
అడవిలో సీతను విడచి నావనము
మునివృక్షుల్లరకు నాకపసారి మాట—
బత్తితో రామునే ప్రార్థింతు ననుచు
అత్తల ముగ్గుర నడిగితి ననుము
మునిపత్నులకు నే మ్రొక్కితి ననుము
మనబంధువులనెల్ల మఱవలే ననుము

తలపున రామునే నిలిపెద ననుచు
ఇలనెల్ల దయతోడ నేలుకొ మ్మనుచు
రారాజు జనకుని గారాముతనయ
కూరిమితోడలు కోసలేంద్రునకి
భూపుత్రి శ్రీరామభూపాలు పత్ని
ఏపాప మెఱుఁగని యింతి యాసీత
దీనురాలై యిల్లు దిక్కులేకుండ
కానలయందున కలసిన దనుచు"
పలుకుచు తనలోని తలఁపుల నెల్ల
విలపించి విలపించి విలపించలేక
దరిలేని శోకాన ధరణిజ పొరలి
మఱుమాట లేకుంత మరల మూర్ఛిల్లె
భూవలయమ్మెల్ల పూజింపఁ దగిన
దైవస్వరూపిణి ధరణిమూర్ఛిల్లె,
మీఁదిమీఁద నింక నీ సీతాలతాంగి
బ్రతికియుండిన మాట ప్రాణాలతోడ.
పాప మాకడుపులో పసికందు వెల్లు
నైపుచుండెనో యీమె సంతాపబాధ,
తలఁచినకొలఁది నాతల్లి దుస్థితిని
నిలువున తనగుండె నీరయిపోయి
ఏమి మాటాడుటో ఏమి చేయుటయొ
సౌమిత్రి యెఱుఁగక చలితచిత్తమున

కన్నీళ్ళు ప్రవహింప కాళ్ళు వడంక
క్రన్నన జానకి కాళ్ళకు మ్రొక్కి,
"కావరే నాతల్లి జానకి నిచట
కాననమ్ముల డించి నేనేగుచుంటి,
పంచభూతములార పక్షీంద్రులార
అంబితోరగులార అర్కేందులార
తరులార గిరులార తారకలార
వర మునీశ్వరులార వాహినలార
దేవతాతతులార దిక్పతులార
కావరే సీతను కరుణతో ననుచు
వితలేక సీత నావిపినమధ్యమున
విడనాడి దీనుడై వెడలె లక్ష్మణుడు.

ఊరికి మఱునాడు రేయింటిగా వచ్చి
ద్వారమ్ముకడ నున్న తమ్ముని జూచి
చూచెను రాముడు శూన్యమా రథము.
ఏదొ నేబాధయో యాచిత్తమందు,
ఎండిన కనుదోయినుండి రామునకు
రెండశ్రువులు రాలి పృథివిపైఁ బడియె
తన బహిఃప్రాణమ్ము ధరణిజ లేని
తనువేల బ్రతుకేల ధారుణి యేల.

జీవిత మ్మొకశూన్యసీమయై గాంచె
భావమందున రామభద్రున కపుగు.

సీత లేదను వార్త శీఘ్రమ్ము ప్రాంత
చేరెమ్ము పల్లను చెరుకులై పోయి
భోరున నేడ్చిరి వారింప రాక
పౌరులు బంధువుల్ పరివార మెల్ల



## సీతా పరితాపము

అవనిజ శోకమ్ము సరయంగ లేక
అవని జీవమ్ము సర్వ మాగినట్లయ్యె
తరువులు తలవాల్చె గిరులు చెమర్చె
పరువులెత్తవు లేడి పక్షిసంతతులు
క్రూరమృగమ్ములు గుహ లందె నిలిచె
పారదు గంగాప్రవాహమ్ము కదలి

లేదు లక్ష్మణు డట లేదు రథమ్ము
ప్రొద్దయి మిగిలెను భూమిజ యొక్కతె.
విలపించినను గూడ వినువారు లేరు
పలుకువారును లేరు పిలచినప్పటికి.
అంతయు శూన్యమూ యవనిజ కపుడు

అంతయు మాయ యాయవనిజ కపుడు.
జనకుని యింట తా జనియించె నపుడు
తనకయి రాముండు చనుదెంచి మిథిల
శివధనుర్భంగము చేసె నేనాడు
అవనిపై నీనాటి కాకథ యెల్ల
తెలియని యొకవింత దృశ్యమై మదిని
కలవోలె కనుపించి కదలపాగినది
ఆరక్కసుల మధ్య నణంగి మణంగి
యేరీతి రామునే యెడద నిల్పినదో
తనమానస మశోకవనసీమ యెఱుఁగు
హనుమంతుఁ డెఱుఁగు నాయగ్నియే యెఱుఁగు
తనమనోదైవమ్ము తనప్రేమమూర్తి
తనరాముఁడే యిట్లు త్యజించి నపుడు
పుడమి నిప్పుడు తనకడుపునఁ బడిన
బిడుగులకై గాక పతి దరిలేని
ఈశిబిరాన నవగిక్కై బ్రతుకంగ వలెనో
మతిఁ దోచ కచటనే యతులదుఃఖమున
అవశయై పడియున్న యవనిజం జూచి
దివినుండి దేవతల్ దీవించి నారు.

## సీత వాల్మీకి ఆశ్రమము చేరుట

మునిసుతుల్ గొందఱా వనవీథి వెంటఁ
జనుదెంచి పండ్లకై జాడకిం గాంచి
అవనీతలమ్మున అవశయై యిటుల
ఏకరీతి పడియున్న దీనాక్షి యచట
చూడగా దుర్భర శోకమ్ము వలన
వాడిపోయిన దీన వదనమ్ము గాని
వదివ్యథామయా యేతెంచినటుల
దేదీప్యమాన మా తేజ మ్మటంచు
వెఱగంది యావార్త వెంటనే వారు
పరువెత్తి చెప్పిరి వాల్మీకి మునికి
అంతరంగమ్మున నామునిచంద్రుఁ
డంతయు పూర్తిగా నరసి వేవేగ
జనకజ యున్నట్టి స్థలమున కేగె
మునికాంత లర్ఘ్యమ్ముఁ గొని తేర వెంట

ఎవ్వరో తనకడ కేతెంచినట్టి
సవ్వడి నాలించి జానకీసతియు
మునివర్యుఁ గని తనమోము పైకెత్తి
వినయమ్ముతో మ్రొక్కి విలపించసాగ
అనునయించుచు సీత కర్ఘ్యమ్ము నొసఁగి
మునిసతు లోపచర్య లొనరించుచుండ

వాత్సల్యమునఁ బల్కె వాల్మీకి యిట్లు
“వత్సరో ! వినుము నేవాల్మీకిమునిని
ఎఱుఁగుదు నీకథ జరిగిన దెల్ల
తెలుఁగంది నీవిట్లు విలపింప కమ్మ !
రాముఁ డెఱుంగఁడే నీమాహాత్మ్యచరిత
భూమిపై వననిందఁ బొందగా లేక
వనవాటికలకు నిన్నంపెనే గాని
మనసు నీమీఁదనే మసలు నాతనికి
పరమపవిత్ర మీవాహినీతటిని
అనయము మద్యదియె నాయాశ్రమస్థలము
చల్లనినీడలఁ జనతపోవ్రతము
ఉల్లాస మొదఁగు నీయుల్లమ్మునందు
మునిపత్ను లున్నారు మునిసతుల్ కలరు
మనమున సందియం బందకుమమ్మ
అకలంకమర్యాద లమరి యెల్లపుడు
సకలోపచారముల్ జరుగు నీకిచట
ననుఁగూడ మీతండ్రి జనకునివలెనె
మనమున భావించి మాతోడ వేగ
అరుదేర మమ్మ నీ విఁకపును మాని
జరగును శుభము లాస్థలమందు నీకు
ననుచు నామౌని తనయాశ్రమమ్మునకు
కొనిపోయెఁ సీతను కూర్మి మీఱంగ.

సీత వాల్మీకాశ్రమ సీమ చేరగనె
వేశమ్ము వంగాన చేసూర కాంతి
జనకజ కేలోటు కన రాని కీర్తి
మౌనులల్ల పరిచర్య నొనరించుచుండ్రి

---

## ల వ కు శు ల జ న న ము

రామునే మనమున వేమారుఁ దలఁచి
రామునే ప్రాణంబు భావించ సతము
ముని యాశ్రమమున సౌ చనుచుండగ నాఁడు
జనకజ ధరియించు మనిశాంతవతిన
రవికుల దైవమ్ము రంగనాథునికి
ప్రవిమలభక్తితో ప్రార్థనల్ సలుపు
మెలమెల్లగా గాంగజలములఁ దెచ్చి
చెలువారు పూవులచెట్లకుఁ బోయు
ప్రీతితోఁ బిలుచును పికశారికలను
లేతపచ్చిక లేరి లేళ్ళకు మేపు
ఆనందమై పొల్చు నంతకంతకును
జానకి కాశ్రమస్థల జీవనమ్ము
జానకి కొకరాత్రిసమయమ్మునందు
కానుపునొప్పులు క్రమముగా వచ్చి

సభకు న గ్రహారాది విభవమ్ము లలర
శుభ రాశులందుండి శోభిల్లుచుండ
ఇనకులోద్ధారకు లిరువురు సుతులు
జనియించి రామేటి సౌందర్యనిధులు.
రామునిఁ బోలిన రమణీయసుతుల
నామోదమునఁ జూచి యవనిజ యలరె
మునిరాజు వాల్మీకి చనుదెంచి వేగ
ఘన యశోబలములు కలుగుగా కనుడు
కుశలవమ్ములతోడ కూర్మి దీవించి
కుశలవులను పేర్ల శిశువుల కిడియె.
రవిచంద్రతేజులు రమణీయతనులు
ప్రవిమలాకారు లాబాలు రిద్దఱిని
మురిసిపోయిరి చూచి మునిపత్ను లెల్ల
అరుదెంచి దీవించి రాశ్రమ మునులు

---

## లవకుశుల బాల్యము

సీతమ్మ కథల మాశిశువులే యిపుడు
సీతమ్మ బ్రతుకెల్ల శిశువులే భువిని
ప్రీతిగా కంటికి ఱెప్పలవోలె
సీతమ్మ పెంచె నా శిశువులఁ జూచి.

మునివాటి కౌశక్రొత్త మురువు దీపింప
మునిబాలకులతోడ చనవుగా కలసి
మునికుల మంతకు మోదమ్ము గూర్చి
దినదిన వృద్ధిగా తేజమ్మునంగి
సురుచిర సద్గుణ సుందరు లగుచు
పెరిగి యాబాలురు పెద్దవారైరి

లవకుశు లిద్దఱున్ లలితధీయుతులు
ప్రవిమలభక్తితో వాల్మీకి వద్ద
పలుశాస్త్రముల నేర్చి పండితు లైరి.
విలువిద్య గడియించి వీరులైనారు
గానవిద్యల గొప్పగాయకు లైరి
వీణచే గొని వారు గానమ్ము సల్ప
మేనులు పులకించు తేనెలే కురియు,
మానిత నవకళామాధుర్య మొలుకు.
తన కనుపండువై జనియించి యిలను
ముని తపోవనులందు ముద్దుగా పెరిగి,
వీరులు ధీరులు విమలసద్గుణులు
శ్రీరాముని యశమ్ము క్షితిమీద నిలుపు
సుహితవర్తను లని మన్నన లంది
బహువిధప్రజ్ఞలై వరలుచు నున్న
సురుచిరమూరు లాసుతులనుఁ జూచి

పూలతేనెలలయి గాలి వీచినవి
కలువవెన్నెలలయి జగమునిండినవి
ఇలయెల్ల శ్రీరామునిలయమ్మై వెలసె

---

## శ్రీ రా ము ని ని ర్వే ద ము

జనకజన్ వీడిన సమయమ్మునుండి
మనమున రాముని కనవరతమ్ము
జానకీరూపమ్ము కానంగ వచ్చు
జానకినీడనే చరియించు గలఁడు.
నెలలు తొమ్మిదియును నిండిన యబల
పలురాళ్ళపై నాడు పడియున్నయపుడు
ఆ సీతగొంతులో నవని నెవరైన
పోసినప్పటి మాట పుడిసెడు నీళ్ళు
కోమలహృదయ ఆ కుసుమాంగి సీత
యేమని తలఁచెనో రామునిఁగూర్చి
ఆవేళ తనవెంట నడచెంచ నంతె
పోవఁగా లేదాము పుట్టింటి కిపుడు
జానకి యేదని జనక రా జడుగ
కానేమి వచియించి తప్పుకోఁ గలఁడు

రాచకార్యము లెట్లొ రయమునఁ దీర్చి
యోచించు శ్రీరాముఁ డొంటిగా నిల్చి

తనహృదయేశ్వరి తనప్రేమ రాశి
తనబహిఃప్రాణమ్ము తనసీత యిపుడు
తననుండి దూరమై చనుచున్న యటుల
మనమందుఁ దోఁచి పట్లనిపించి తనకు
నిలుచున్న కాఁ డట్లె నిలుచుండిపోవు
పలుకఁ జెన్నఁతోఁప పిలువఁ డెవ్వరిని

---

## శ్రీరాముఁడు సోదరులకు రాజనీతి బోధించుట

రాయిడి నొందెడి రాము నెమ్మొగము
పోయి చూడగ లేక నలుగురు తమ్ములును
జానకి పాల్పన్న సమయమున్ యునుచు
దీనులై మనముల దిగులు నొందెదరు.
మనమున శాంతితోఁ మాటి యేమఱక మొ
వినుఁడంచు తమ్ములన్ బ్రీతితోఁ బిలిచి
శ్రీరాముఁ డవుడిట్లు చెప్పుచు నుండు
నేరాజునాథుఁడో యేనీతి కథతో
రాజు లేరీతిగా భూజనమ్ములను
రాజధర్మమ్మున రక్షింపవలెనో;
ఈయుర్విపాలన మెట్లుండవలెనో

న్యాయమున్నిర్ణయ మెట్లు చేయంగవలెనో
ఆదరమ్మేవేళ నాగ్రహమ్మెప్పుడు
మేదినీపతి చూపి మెలంగగవలెనో,
తమ్ములకును రాజ్యతంత్రమ్ము నెల్ల
సమ్యగ్గా బోధించె నెల్ల రాఘవుండు.

---

## శత్రుఘ్నుండు లవణాసురుని సంహరించుట

వింతవచ్చె నింతలో విపరీత మగుచు
దనుజులబాధలు ధరణిని మరల
మధురాపురికి రాజు మధుదైత్యసుతుండు
పృథివి కంతకు పెద్దబెడదగా ప్రబలి
లవణాసురుం డొకం డవనిపై దిరుగు
భువిని తానొక్కండె మొనగాండ ననుచు
రావణుమేనల్లుం డావీరుం డెపుడ
కావరమ్మెసంగిన కడుదుష్టుం డతండు
మునులు వచించి రాదనుజుని వేగ
దనుజువాడుచే భూమి కనుకూల మనుచు
తనతండ్రి జీవించు దినములనుండి
తనగృహమ్మందున తినయు చున్నట్టి

శివునిశూల మ్మొందు చేటూని లవణుఁ
డవని నజేయుఁడై యనిసేయుచుండు
ఇనకుల తిలకు నాయనుపమబలుని
దునిమె మాంధాత నాదుష్టదైత్యుండె

లవణుని దుర్మార్గ లక్షణమ్ముల్ల
చెవియొగ్గి యాలించి శ్రీరాముఁ డంత
అనుపమ యోధుఁడు తనపినతమ్ము
నని పె శత్రుఘ్ను నాదనుజునిఁ ద్రుంప.
సమధికవీరుఁ డాశత్రుఘ్నుఁ డంత
సమరసన్నద్ధుఁడై చనుచు పోరికిని
విశ్రాంతికోఱకయి వెడలి వాల్మీకి
యాశ్రమమందున నాగ నారేయి
జనకజ సుఖముగా కనియె నానాఁడె
మునియాశ్రమమ్మున తనయు లిద్దఱిని
జనకజా గూర్చిన సంతోషవార్త
వినిన శత్రుఘ్నుఁడు మనమున నలరె

జనకజ కుశలమ్ము వినిన యంతటనె
ఇనుమడించిన బల మ్మొసఁగి శత్రుఘ్ను
డరిగెను వేగ మా యసురునిఁ జంప
మఱునాఁడె పయనమై మధుపురమ్మునకు.

అరిగి శత్రుఘ్నుఁ డాపురవరమ్ములన
హరునిశూలము తనకరమందు లేక
తిరుగాడు లవణుని తిలకించి తనకు
సరియైన కాల మీక్షణమని తలఁచి

ఓలోకకంటక ! నిన్ను బోకార్చఁబోతిక
నీకెదు రఁజెంచి నిలిచి నానిచట
పాఱుబోకా! యింక పారిపోఁబోకు
పోరిలో నిన్నిదే పొలియింతు ననగ
తనశూలమును వెంటఁ గొనిరాని పనికి
మనమున లవణుఁడు వనరి యొక్కింత
సమరమ్మునకు వచ్చు శత్రుఘ్ను తోడ
సమధిక రోష వేషావేశుఁ డగుచు.

ధారుణి కంపించు తీరున రేఁగి
ఘోరయుద్ధమ్మయ్యె వారి కిర్వురకు
విహరించి దుర్వార వీరుఁడై యతని
బహువిధ శస్త్రాస్త్ర శరాగ్నిఁ గురిసి
అచలిత సాహసబలాధిక్య మలర
హతమార్చె శత్రుఘ్నుఁడా దైత్యవరుని
భూవలయము గోల మూలకుఁ ద్రోయు
రావణు నంతటి రణవీరుఁడైన

లవణుని శత్రుఘ్నుఁ డవలీల ద్రుంచె
నవని దుర్లభ మిట్టియతిశయ మనుచు
మునులును జనులు నా దనుజుని మృతికి
మనముల ముదమంది మధుపురమ్మునకు
జననాథుఁ జేసిరి శత్రుఘ్ను నపుడు
వినుతసామ్రాజ్యశ్రీ విభవమ్ము లలర

---

## శ్రీరాముఁ డగస్త్యుని క్రతువు దర్శించుట

ముని యగస్త్యుం డొకముఖ్యమౌ క్రతువు
నొనరించు చున్నట్లు విని రాముఁ డేగి
ముని యగస్త్యునకును మునుల కెల్లరకు
వినయమ్ముతో మ్రొక్కి వీక్షించె క్రతువు.

రాజాధిరాజును రాజితగుణుఁడు
భూజనవంద్యుఁడు పుణ్యాత్ముఁ డైన
రాముఁ డీక్షించెను క్రతువునుఁ జూచి
భూమీశులం దిట్టి పుణ్యభావమ్ము
లింతటి నయశీల మొప్పఁగ నటంచు
సంతసమంది రాసంయమివరులు
సవనమ్ము లొనరించి చరితార్థు లైన
అవనీశముఖ్యుల వివిధసత్కథలు

రెండుదినమ్ము లాబుష్యాశ్రమమున
నుండి రాముఁడు విన నుత్సాహ మునఁగ
నిర్వహింపగ మునుల్ సుస్థాత్ములగుచు
సర్వసమ్మతముగ జన్నమ్ము ముగిసె
సవనహవ్యమ్ముల సరసత మీఱ
దివినుండి యరుదెంచి దేవతల్ గొనుచు
మునిజనమ్ముల నెల్ల వృఁమిబామలను
ఘనముగ దీవించి చనిరి తెన్కకును
జనులకు జగతికి సంక్షేమ మెంచి
మునులు నిస్వార్థులై యొనరించు కృతుల
మునుల త్యాగమ్మును మునుల యాశయము
మునుల చరిత్రము మునుల జీవనము
మఱిమఱి మెచ్చుచు మానసమందు
తిరిగి యయోధ్యకు నరిగె రాముఁడు.

---

## శ్రీరాముఁ డశ్వమేధయాగ మొనరించుట

అమరులఁ దనియించి యవని గొలంగు
సమధిక సంపదల్ జన్నమ్ము లనుచు
విశ్వప్రశస్తమై విలసిల్లు యాగ
మశ్వమేధ మొనర్ప నాత్మలోఁ దలఁచి
రాముడు మునులను రావించి నుడువ

ఆమోదమును దెల్పి కులగురుడు వాసు
తనమంత్రివర్యులు తనసహోదరులు
వెనువెంటనే శాస్త్రవిధి విధానముగ
సకలసన్నాహముల్ సలిపిరి వేగ
సకలసంభారముల్ సమకూర్చినారు
అతిశ్రమ మందక ఆహ్వాన మంపి
క్రతుదీక్షితుం డయ్యె రామచంద్రుడు
వచ్చిరి మునివరుల్ బంధుమిత్రులును
వచ్చిరి రాజులు వానరాధిపులు
వచ్చెను లంకాధిపతి విభీషణుడు
వచ్చినవా రెల్ల తెచ్చిరి ప్రీతి
మణిమయ భూషణ ధనధాన్య మహిత
కనకాంబరాదులు కాన్క లెన్నెంటినో
తనవెంట లవకుశుల్ తనశిష్యగణము
చనుదేర వాల్మీకి సంయమి వచ్చె
అకలంక రీతిగా నతిథుల కెల్ల
సకలమర్యాదలు జరిగె నచ్చోట
జవమున లక్ష్మణుం డవనియంతటను
సవనాశ్వమును ద్రిప్పి జయముతో వచ్చె.

రాజితసమ్మాన రమ్యసత్కృతులు
భోజనపంక్తులు భూరిదానములు

ఆ వేత్కా లావిందు లావిన్ దపులు
ఆవేసపారమ్ము లాక్రతుక్రమము
లాతురత ధర్మనిష్ఠాభ్యాస విధుల
శాకూగతజనాళి కంటిమ్ము లేక
ఆయజ్ఞవేళయం దలరి పెంపార
నాయయోధ్యాపుర మ్మమరధామముగ,

---

## లవకుశులు అయోధ్యలో రామాయణమును గానము చేయుట

తరుణమ్ముఁ గనుగొని తపసి వల్మీకి
ధరణీజాత్మజులను దరికిరాఁ బిలిచి
"ఎలమి మీరిర్వురు నేకకంఠముగ
లలితగీతముల నో లవకుశులార !
రామునిచరితమ్ము రామాయణమును
మీమనోహరగాన సామర్థ్య మెసఁగ
రంగారు సాకేత రాజమార్గముల
అంగడులందున యజ్ఞశాలలను
గానమొనర్పుడు కమనీయఫణితి
వీనులవిందుగా వినువారికెల్ల

భూమిజాసుల తండ్రి భూపతి గాన
రామునే తండ్రిగా మీమది నెంచి
ఇక్ష్వాకు రఘుకులోద్భవులు మీరంచు
చెప్పెను వాల్మీకి శిష్యుల మునుగ,
వెలుగు గావుత మీకిప్పటికిని
కాలుర దీవించి పంపె వాల్మీకి
ప్రవిమలాకారు లారాముని సుతులు
దివినుండి దిగినట్టి దేవతల్ వారు
జానకీరాముల సచ్చరిత్రమును
వీణల చేబూని వీథివీథులను
రారయ్య జనులార రమణీయమైన
శ్రీరామకథ మీకు చెప్పెదమయ్య,
ప్రవిమలానంద మారామునిచరిత
చవులూరు వాల్మీకిసంయమి కవిత
శ్రీమహావిష్ణు వారామభూనేత
శ్రీమహాలక్ష్మి యాభూమిజాత సీత,
అవతారమూర్తు లీభువనిని వారు
అవనిశ్రేయము నెంచి అరుదెంచినారు,
పరికింతు రాశ్రితుల్ భవ్యసత్కృపలు
కరుణాపయఃప్రసులానుకు చిరాశ్రితులు,
రాముడు రారాజు రాణి సీతమ్మ
భూమిపై స్వర్గమ్ము రామరాజ్యమ్ము

కల్లనిద్దైవముల్ జగతికంతటికి
తల్లిదండ్రులు వారు ధరణి నెల్లరకు
జనకజారాముల సచ్చరిత్రమ్ము
ఒరులార రాసయ్య వినుపింతు మేము"
అనుచు రామాయణ మాద్యంత మచట
వినయసౌజన్య లాబిడ్డలిద్దఱును
గానమాధుర్యముల్ కాల్వలై పార
వీణల చేబూని వినిపించి రంత
తేనెలు వర్షించె తీయముల్ గురిసి
ఆనాఁటయోధ్యయం దన్నిచోటులను.
లాలిత వాక్సుధా వ్యాలోల మైన
బాలుర మాటలో పాటలలోన
వీణతీవలనుండి విశ్వమ్ము నిండి
రాణచెల్వారిన రామనామమ్ము
ఎంతమనోహర మ్మెంత రమ్యమ్ము
ఎంత సమ్మోహన మెంత హృద్యమ్ము
ఆమోదభర సంపదారామ మగుచు
రామమయమ్మయ్యె భూమి సర్వమ్ము
దేవతాదేవుని దివ్యనామమ్ము
పావనమ్మొనరించె వసుధనంతటిని,
సంగీత సాహిత్య సమ్మోద ఝరులు
పొంగారి ప్రవహించె పురవీథులందు,

అవతారమహాత్త్వ లాంఛనలవర్తనుల
ప్రవిమలచరితలో బ్రతుకులే నిండి
పరువెత్తి పురజనుల్ బాలురవెంట
పరవశులైరి యాపాటల వినుచు

ఏమి యీ మాధుర్య మేమి యీగాన
మీ మనోజ్ఞాకారు లెవరు వీ రనుచు
బాలురమాటయే పట్టణమ్మెల్ల
బాలురమాటయే పౌరుల నోట
శ్రీమహానీయ మా రాముని చరిత
మాహ్లాదముగ గాన మాలపించుచును
భువనమందర దివ్య మోహనాకృతులు
లవకుశుల్ సుకుమార లావణ్యతనులు
పురవీధులందునఁ దిరుగుచు వేగ
అరిగినంతన రాము యజ్ఞవాటికకు.

తిలకించి రాముఁడు పులకించె మదిని
మొలకెత్తె నేదియో పుత్రభావమ్ము
ఆముగ్ధసౌందర్య మారాజశీవి
ఆమోముపోలిక లామేనిసొబగు
లాబాలవీరుల యందమ్ము లరసి
నాబిడ్డలే వీరు నవ్యమన్మథులు

మునికి గాకుటగా విని యది వేగ
కొనిరమ్ము జానకి యనిచెప్పె నపె.

రాముని మాటలు మోదాల విప్పారి
ఆమోదములరంగ నతిశీఘ్రముగ నల
సౌమిత్రి వసకేగి యామునికోడ
రాముని మాటల మును వచించె
శ్రీరాము వాంఛను సీత కాదనమి
ఆహూతిగా పోవ మానదు వాల్మీకి
మునిచంద్రుడు నెగెను ముదమున నపుడు
జనకజను దోడ్కొని సాకేతపురికి.



## భూదేవి సీతను గొంపోవుట

ధరణీపుల్ మునులను పుంజను లెల్ల
రయడెంచిపట్టి యాగమజ్ఞవాటికకు
జనకజం గొనివచ్చి సభికులు వినంగ
వినయమ్ముగా నిట్టు లనియె వాల్మీకి
"శ్రీరమ్యగుణసాంద్ర ! శ్రీరామచంద్ర !
కారుణ్యగుణధామ ! కమనీయనామ !
సౌమిత్రి మరుపంగ నీమాట లెల్ల
ఆమోదమయ్యెను నామదినిండు

కనఁగాను మయ్య నా వెనువెంట నదిగో
చనుదెంచె సీత నీచరణసేవలకు
భువిమీద ధర్మమున్ పొలుపార నిలుప
దివినుండి వచ్చిన దేవుఁడ వీవు
నేనెంతవాఁడను నీకుఁ జెప్పంగ
వినను నావాక్య మాలింపు మొకటి
పాపుఁ డొకఁ డన్న పలుకల కోడి
ఈరీతి నీభార్య నడవఁ బాయఁ దగున
భూపుత్రి యీసీత పుణ్యచారిత్ర
పాప మెఱుఁగని దీయింతి వినుము
కొలువంగ లేదె ఈ లలితాంగి కేల
మలనాఁడు లంకలో నగ్నిదేవుండు
నీమాట కొలఁది యాసౌమిత్రి వచ్చి
భూమిజన్ విడనాడి పోయిన యపుడు
జానకి నొంటిగా కాననవీథి
నానాఁడు జూచి నాయాశ్రమస్థలికి
అనునయించుచు చాల నాదరమ్మునఁగ
గొనివచ్చినా రయ్య మునికాంత లరిగి.
లవకుశు లీరవ లవనీంద్ర! కనుము
ప్రవిమలాకృతులు నీబాలురు వీరు.
పెరిగిరి నాకడ పెద్దవా రైరి
సురుచిర సద్గుణ శోభితుల్ వీరు

చేకొనుమయ్య నీచిఱుతగోలుకుల
జనులు హర్షింతురు జగము హర్షించు
మునులును హర్షమ్ము పొందుదు" రనంగ

శ్రీరాముఁ డంతట చేతులు మోడ్చి
పౌరులెల్లరు విన వాల్మీకి కనఁగ
"అనఘాత్ములార నా కాత్మలోఁ దెలియు
జనకజ నిర్మలసౌశీల్య మెల్ల
మునిచంద్రుఁ డిట్టుల వినిపించు కంటె
జనులమధ్యమ్మున శపథమ్ము జేసి
జనుల కింకొకసారి తనప్రవర్తనము
జనకజ తెలుపుచో చాలమే" లనియె.

మరల నిట్టి పరీక్ష ధరణిజ కేల
జరిగిన దెల్లను చాలదా యనుచు
జనులెల్ల శ్రీరాముఁ డనిన వాక్యములు
విని మనమ్ములయందు విభ్రాంతు లైరి

ఎలువురి ముందున నగు బాటు గాగ
తలగొట్టి వట్లయ్యె ధరణిజ కపుడు.
చెచ్చెర రావించి శ్రీరామవిభుఁడు
రచ్చకీడ్చుట కేల రాపాడు టేల!
ఈ పరీక్షలు తన కింకెన్ని కలవో?"

భూపుత్రి యొనిచె "భూమిపై నెవడు
నాపురుషోత్తము డవే రెవ్వరు కన్పడరు
ధరణిపై తనతేజ స్త్రీసత్వమ్ము లేదని
జనులు సంభావించి మునులకు మ్రొక్కి
తనపాతి దము లో కనుల దృఢాని
కనుదోయి నశ్రుల్ పొర్లగ నపుడు
తనయుల నొకసారి గనుచు ముద్దాడి
భూతలమ్మున దృష్టి పొలుపుగా నిలిపి
చేతులు జోడించి సీత పల్కెనపుడు

"సత్యమ్ము రామాజ్ఞ జరియుంప నేని
పతిని దైవమ్ముగా భావింతు నేని
నిత్యమ్ము రాముని నే గొల్తు నేని
ప్రత్యక్షసాక్షిగా పంచభూతములు
ఏపాప మెఱుగని యిల్లాలి నేని
ఈ పాట్లు దప్పించి యిక నైన నాకు
త్రోవఁజూపవె నేడు కావవే నన్ను
బ్రోవవే నాతల్లి భూదేవి" యనుచు.

తల్లమ్ము లగులగా నర్త్వేజ యట్లు
తల్లిని ప్రార్థించి తనువు వాల్చినది.

జనకజ శోకమ్ము జంకజ మదవి
కనిన చెప్పడా కాను వినిన దేఁటగాడు

ఎవతెకై యానాడు శివుని విల్విఱిచి
ఎవర్తెకై రావణున్ బవరాన గెల్చి

ఎవర్తెకై కతఁజెంది యిన్నాళ్ళు తాను
ఎవతెనాసించి నేఁడిచటకుఁ బిలిచె
ఆ సీత తనభార్య తనకు వేఱుంచ
కనఁ బంచె ఘోరాన్యమై కనులరు జగము
తలపోసి రాముఁడు తనమనోవ్యథలు
నిలువున నీరయి విలపించె నిట్లు.
"రామునిఁ గూరిచి నీమానసమున
ఏమనితలఁచి నీవిట్లు చేసితివి
సౌశీల్యరాశి ! ఓ జానకిదేవి !
ఆశతో రమ్మని అర్థించినాను
మామనంబు నీ వొకమాటను జెల్పి
ప్రేమతో నావైపు విచ్చేయుదనుచు
ఆసించి నిన్నిట్లు నడిగితిఁ గాని
ఓసీత ! నీమన స్సరయ లే నైతి
ఇంతమాత్రమున నీవింతసాహసము
పంతానఁ జేసితే పలువురిముందు.
శ్రీరాముఁ డొకయెగ్గ చేసెనే యనుచు
సైరింపలేవె ఈస్వల్పమాత్రమును
ఎఱుఁగుదే సీత నీకొఱకు నేనెంత

దూపిల్లి యొంటిగా దుఃఖించనానో
దనుజుండు నిన్నటుఁ గొనిపోయి నపుడు
నిరుతరాత్రి నిన్ గనుగొనలేక
విలపించితిని నేఁడు విపినమార్గముల
విలపించెద నయోధ్య వీథి కో నేఁడు
ననుఁ బిడి యేఁగితే నాభాగ్యరాశి,
ననుఁ జాల్లు మఱచితే నాసీత! యనుచు
ఆననమ్ముల్లోన నశ్రువుల్ గ్రమ్మ
దీనుఁడై రాముఁడు గిరత పీసి
విలపించె పలుమార్లు తలఁచి జానకిని.
పలుకవే జానకి పలుకవే యనుచు.



## రాముఁడు భూదేవిపై కోపించి బాణ మేయబోవుట

విలపించి రాముఁడు పలుమాఱు లిట్లు
తొలిదుఃఖ మొక్కింత తొలఁగిన యంత
భూపుత్రిపైఁగల మోహాభావమ్ము
కోపమ్ముగా మాఱి కుంభినిమీద
"అవని రాఘవుఁ డెంత అలుసయి పోయె
అవనిజ నప్పుడా యడవిలో నన్ను

కనుగప్పి యసురుడు కొనిపోయినాఁడు,
కనులముందే నేఁడు కొనిపోయె భూమి.
ఈరీతి నవమాన మిలమీఁదఁ బడుచు
భీరువై పడియుండఁ డీరాముఁ డీకను
చెడుతలం పసరిన నెఱవడి కాక
భృశమి దెంతటిది నావంటిఁ గొంపోవ
నా సీత నిటఁ దెచ్చి నాకీయ కున్న
ఈవసుస్త్క్షోణి నేకబాణమున
చూర్ణమ్ముఁ గావించి చూపెద ననుచు
పూర్ణాగ్రహమ్మెద పొంగులువార
చాపమ్ము సారించి శరము సంధించి
కోపాన రాముఁడు కొట్టఁబోవంగ,

"ఆగుమో శ్రీరామ! అవని నేయకుము
ఆగుము రామ దేవ! అఖిలేశ!" యనుచు
వరుసున బ్రహ్మాదిసుర లరుదెంచి
మొఱవెట్టి రాముని ముంగల నిలచి
''సర్వజగన్నాథ! సర్వమయాత్మ!
సర్వేశ్వరా! రామ! సర్వరక్షకుఁడ!
ఈభూమి యెల్ల నీసృష్టియే కాదె
ఈభూతసంచయ మెల్ల నీయదియె
ఒకసీతకొఱకు నీవుగ్రుఁడై, ద్రుంప

సకలమ్ము నీకలమై సమయును దేవ!
విశ్వమ్ము నీయందె విలసిల్లుచున్న
విశ్వనాథుండ వీ విపరీత మేల?
సీతయేగున నీదు చేతమ్ము పీడి
సీతయు నీవును చిరజీవు లవని,
జానకీరాముల సంయోగగాథ
మానికాదర్శమై మహిమీద వెలసి
ఆచంద్రతారార్క మలరును దేవ!
ప్రాచుర్య పావనభాగ్యమై భువికి
వ్రాసియుంచెను మున్న వాల్మీకిమౌని
భాసురమ్మైన యీపావనచరిత
అమరభాషామృత మ్మాదికావ్యమ్ము
రమణీయ గ్రంథమ్ము రామాయణముగ.
విశ్వసంశ్రేయమై విజ్ఞాన మొసఁగి
శాశ్వతమ్ముగ నిల్చు జగతి నీచరిత
శాంతింపురామ! ఈసత్యమ్ము నెల్ల
స్వాంతమ్మునం జూచి చాపమ్ము విడుము
చేకొమ్ము కూర్మి నీ చిన్నబిడ్డలను
చేకొన్న క్రతుపూర్తి చేయుమీ మనఁగ
శాంతించె రాముఁడు చాపమ్ము విడచి
సంతసమందిరి జనులు సంయములు

---

## శ్రీరాముని యజ్ఞసంపూర్తి

చేతఋక్కులందున సీతను నిల్పి
క్రీడగ దరిఁ జేర్చి బిడ్డలిద్దఱిని
సన్నుతరీతుల శాస్త్రోక్తవిధుల
జన్నమ్ము రాముఁడు సంపూర్తిఁ జేసె,
అమరవర్యులు వచ్చి ఆశీస్సు లిచ్చి
క్రమముగ హవ్యముల్ గ్రహియించి చనిరి
పదపడి వాల్మీకి బాలురచేత
పఠియించె సభ్యులు ముదమంది వినఁగ
రమణీయమగు తనరామాయణమున
కమనీయ ముత్తరకాండమ్ము నల్ల
నరపతి నీపుణ్య చరిత మాలించి
రాముఁడు సైకొని రాజ్యభారమును
అరిగిరెల్లఋషులు ననుభవించుచును
భూమినిఁ బాలించె పుణ్యకార్యముగ
భువనసంపూజ్యుఁడు పుణ్యవర్తనుఁడు
రవికులసోముఁడా రామభూవిభుఁడు
తనయేలుబడిలోని జనులశ్రేయమ్మె
తనకిల పరమార్థమనుచు భావించి
యజ్ఞమ్ము లొనరించె నతిథులఁ దనిపె
విజ్ఞుల సేవించి విబుధులఁ గొల్చె
సలిపె సత్కార్యముల్ సద్గోష్ఠి నెఱపె

విలసితదానముల్ విప్రుల కిచ్చి
ఎన్నిజేసెయుఁ గూర్మిఁ సెంద రామునికి
ఎన్నియు గొంటితిరుగ్యో సవనిజ లేక
మఱిదియా రామునకు పోటలనైన
మఱువఁజాలక తనమదిని జానకిని
బాయక గడుగొంచు జేలోటు లేక
కాలమ్ము గరాం తిరిలేఁగాఁ డపె

— —

## కౌసల్య సుమిత్ర కైకేయుల మరణము

సాదరంబిల్లఁగా జనులను గనుచు
మేదిని ధర్మముల్ నేలుగా నిలిపి
రాజగారాముఁడు రాజ్యమేలఁగ
రాజిలవర్ణాత్త లారాజమాతలును
వాసిగ దశరథవసుధేశు సతులు
కౌసల్యయు సుమిత్ర కైకేయి మిగుల
నానంద మందిరి యాత్మల యందు
మానుగ ఫలియించె ము జన్మలనుచు
జానకి లేపట్టి సంతస భరము
రానీయకుంపగ రాము నోదార్చి
బుడుతమున్నలఁ గని ముద్దాడుకొనుచు
గడిపి రందిరి తముకాలమ్ము నెల్ల

వేలాదియేండ్లుగా పృథ్వితమ్ము
నేలిన దశరథు కల్యాంగ్రుడు వారు
భూమిజశుల్కులా పుత్రులం గనిన
వీరు మాగలు నేడు వృద్ధులైవారు
ఆకలంకచరిత డొ నాస్త్రేశుం గలియు
ఒకరిదొన్న గ నొక్క దుర్యాని వీసి
చనిరి యు మావ్వరున్ స్వర్గలోకమునకు
తనయులు సుఖాన మునిగి శోకించ



భరతుని సుతులు గాంధారపతులగుట

కైకేయి తమ్ముండు కేకయనృపతి
సాకేతమున రామచంద్రునిం జూచి
వినిపించె గంధర్వు లానరించు దౌష్ట్య
మనిపెను గార్గ్యునన్ మునిచంద్రు నొకని

సింధునదీ తీర సీమలయందు
గంధర్వు లెందఱో గర్వాన వచ్చి
ప్రజలను పీడించి రాజుల నణచి
నిజరాజ్యపదముల నెమ్మి నిర్మించి
విహరించుచుండిరి విచ్చలవిడిగ
మహివాద వారల మదమణగింప

రామ ! నీవే యిటు రావలె ననుచు
అమాని నుతునగా రాముఁడాలించి
నిగమము బలుఁడైన భరతునిఁ బిలచి
"భరతుఁడా నీ గొప్ప సైన్యబలముతో నేగి
మనమామ కేకయ మనుజనాథునకు
వినతుల నర్పించి వేగమ్మె యట
వైరులఁ బరిమార్చి వారిభూములను
ధారుణీశులుగ నీతనయు లిర్వురిని
తక్షపుష్కలులను తనరంగ నిలిపి
అక్షయ్య ధృతిమీరి సరిగ రమ్మనుచు
భరతుని సుతులకు పట్టమ్ముగట్టి
భరతునితోఁగూడ పంపె రాముండు.

సమరసంరంభుఁడై సైన్యబలమ్ము
సమకూర్చి భరతుఁడు చయ్యన నేగె
మామ్యుఁ డాతని మేనమామయుఁ గూడ
సైన్యమ్ముతో వచ్చి పాయ మ్మొనర్చె
శైలూషుఁ డాదిగా సర్వగంధర్వ
పాలకల్ భరతునిపైకి దండెత్తి
మాయారణమ్మును జేయ నుంకింప
పాయని ధైర్యాన భరతుఁ డోడించి
ఆ యమా లొక్కట్ట ప్పుడి వారిపై నడచి

విలసిత భుజబల విక్రమ మ్మెసఁగ
పరిపోవుట క్షైన దగి రేకుంపి
దారుణ శరవృష్టి ధారాగాఁ గురిసి
గంధర్వులను గెల్చి రంజిగింప
గాంధారరాజ్యాన కడువైభవముగ
జనులెల్ల హర్షింప తంక్షుఁగా రుఁను
వసుశోభలఁ జేసె వసిడి రొసంగ

---

## శత్రుఘ్నుని కుమారులు మధుపురాధిపతులగుట

అనుచరయుతముగా నసురేంద్రు లవణు
ననిలోన శత్రుఘ్నుఁ డంతమొందించి
బహుళసంపదలతో భాసిల్లు నట్లు
మహనీయరీతిగా మధుపుర మ్మేలి
తన పుత్రులు సుబాహుఁడు శత్రుఘాతి
యనువారి నిర్వురి నతిముదమ్మలర
మధువిదిశాఖ్యాన మండలమ్ములకు
పృథివీశులం జేసె వివిధ సైన్యముల
వారికి సమముగా భాగించియిచ్చి
శ్రీరాముసేవింప చిత్తమునందు
కోరికవొడమగా చేరె నయోధ్య
వీరశేఖరుఁడయి విజయుఁడై తిరిగి.

రావణు సంగతి రాక్షసుఁ లవణు
తావర మ్మడగించె కడక శత్రుఘ్నుఁ
డనిలోన గంధర్వు లందఱిం గెల్చి
చనఁ జెంచె భరతుండు సాహస మ్మలర
తమ్ముల విజయములఁ దగుకీర్తి పొగడి
సమ్మోదమున రామచంద్రుఁ డుప్పొంగె



## లక్ష్మణుని సుతులు రాజు లగుట

భరతశత్రుఘ్నులు వారిపుత్రులను
పరిపాలకులఁ జేసి వచ్చుట గలసి
విలసితసద్గుణుల్ విక్రమధనులు
లలితస్వరూపులు లక్ష్మణసుతులు
ప్రీతి నంగద చంద్రకేతులఁ గూడ
క్ష్మాతలేశులఁ జేసె సరవి శ్రీరాముఁ
డంగభూమికిని మల్లావనీస్థలికి
మంగళోత్సవ కార్యమహిమ లింపార.

తమపుత్రులకు రాజ్యధర్మముల్ తెలిపి
రమణీయముగ వారు ప్రజ నేలుచుండ
కనుగొని మనముల కడుముద మొంది

అనుజులు మువ్వురు నరుదెంచి నారు
పరగున సాకేత పురికి శ్రీరాము
చరణసేవయె తమ పరమార్థ మనుచు

---

## బ్రహ్మదేవుని దూతగ యముఁడు రాముని దర్శించుట

ఈరీతిగా కాల మేగుచు నుండ
శ్రీరాముకడ కొకమునీ యేగుదెంచి
"అరుదెంచితిని రామ! త్వరగ నీకొక్క-
పరమరహస్యమున్ వచియించుకొఱకు
మనము మాటాడుచో మనమధ్య కెవరు
చనుదేర రాదట్లు చనుదెంచు వరుని
మరణశిక్షకు నీవు గురిసేయవలయు
మఱి వారు వీరని మదినెంచఁ బోక
అటులైన చెప్పెద ననఁగ నామాని,
యటులనే యని రాముఁ డంగీకరించి
దాపున కావలను తరలిరాకుండ
కాపుంచె ద్వారమ్ము కడను లక్ష్మణుని
ఆకడ కెవ్వరు రాకుండఁ జూచి
యేకాంతమున మునియిట్లు వచించె.

"పరమేష్ఠి పంపంగా వచ్చితి నయ్యా!
సరగున నొకవార్త నెఱిగింప నీకు
మునినయి యముడను ముదమున నిటకు,
వినుమయ్య యావార్త విన్నవించెదను.
"నారాయణుండవు శ్రీరామ నీవు
ధారుణీతలమున దైత్యులబాధ
వారింప సురలకు వాగ్దాన మొసఁగి
శ్రీరామమూర్తిగా క్షితిని బుట్టితివి,
రావణుం డాదిగా రాక్షసతతిని
కావర మడఁగించి కడతేర్చినావు,
ధరణీతలమ్మున ధర్మమ్ము నిలిపి
కరుణతో సాధుల గాపాడినావు,
ఆదర్శనృపతిగా నవని నేలితివి
ఆదర్శనరునిగా నవని నిల్చితివి,
క్షేమదాయక మయి భూమి నెల్లపుడు
రామరాజ్యము నిల్చు రాజితరీతి
పూర్తి చేసితివి నీపుణ్యకార్యమ్ము
కీర్తి కెక్కినది నీవర్తనమ్మెల్ల
చేరెను శ్రీలక్ష్మి సీత యిప్పటకు
శ్రీరామ నీపాదసేవల కొఱకు
పావనమ్మైన నీ వైకుంఠపురికి
వేవేగ నీవిక విచ్చేయవలయు

నీరజ నేత్ర! నన్నుఁ గావంగ
నీరాక కొఱకునై నిలిచితినా" నంచు
పరమేష్ఠి పంపిన వార్త శ్రీరాము!
అనుపించి మఱలితి" నని యముండు

---

## లక్ష్మణదేవుని ప్రాణత్యాగము

పరమేష్ఠి పంపిన వార్త నాలించి
మరల రాఘవుఁ డేదో మాటాడుచుండ
వినవచ్చె నాగది వెలుపలి నుండి
ధ్వనియొకఁ డెవ్వరో పలుకుచున్నట్లు

"దశరథ శ్రీరామ ధరణిపాలునకు
నుడువుడు నారాక కడువేగ" యనుచు
ముక్కోపి దుర్వాసముని కేకలిడుచు
గ్రక్కున ద్వారమ్ముకడ కేగుదెంచె
ఆముని రభసమ్ము నరసి లక్ష్మణుఁడు
"స్వామి కాలుఁ డొకింత రాముఁడు లోన
మంతనం బొకరితో మాటాడుచుండె
ఇంతలో వచ్చి మిమ్మీక్షించు" ననఁగ
పటుకోపమున రేగి పండ్లు దీటించి
తటతట లాడుచీ దుర్వాసమౌని

"శివుండైన నాకడ్డు చెప్పఁగ లేఁడు
ఎవరురా! నీవు ఇన్నిట్టు లా పెదవు?
ఇప్పుడే దుర్వాసుఁ డేతెంచె ననుచు
చెప్పుము రామునకో శీఘ్రమ్ము నీవు
నీ వేగకుండిన నిన్ను శపించి
నీవంశనాశమ్ము గావింతు" ననియె.
ఒకప్రక్క దుర్వాసు నుగ్రకోపమ్ము
ఒకప్రక్క శ్రీరాముఁ డొసఁగిన యాజ్ఞ
ఉరిపెట్టినట్లయి యుల్లమ్మునందు
ఎఱుఁగక తానప్పు డేమిచేయుటయు,
సకలబంధువులను సమయుటకంటె
ఒకఁడు చచ్చుటయె మేలుర్విపై ననుచు
తనుతాళకుండగ వెడలి లక్ష్మణుఁడు
మునిరాక లోనికిం బోయి వచించె
శ్రీరామమూర్తియున్ ఋషిచంద్రుఁ డున్న
ద్వారంపుతలుపు ను భళ్ళున తెఱచి
తమకు లక్ష్మణుఁ డడ్డుతగిలె నటంచు
యముఁ డాగ్రహించి తావరిగెను మగిడి.

శ్రీరామచంద్రుండు శీఘ్రమ్ము వచ్చి
ద్వారమ్ముకడ నున్న తపసినిఁ జూచి
అతఁ డాకలిగొను టాత్మలో నెఱిఁగి
అతనిక్షుధ దీర్చి యర్చించి పంపె.

తానేవా మాతనహర్మ్యాని యుండెంగ
ఆనతి లేకుండ లోనికి వచ్చి
శిక్షార్హు డయ్యెను లక్ష్మణుం డనుచు
వీక్షించి రాముండే విషమసంఘటన
ము నివసిష్ఠాదులౌ ముఖ్యులం బిలచి
విన్నవించె కర్తవ్య విషయమ్ము లెల్ల
"ప్రతినకు రారాదు వ్యతిరేక మెపుడు
ప్రతినదప్పిన సత్యవచనమ్ము తప్పు
సత్యమ్ము దప్పుట జగతికే ముప్పు
ప్రత్యవాయము ధర్మపాలనమ్మునకు
అనుజునికంటె ఈ యవని సూనృతము
ఘనతరం" మ్మని చెప్పి మును లేగినారు.

కనులముందుగ నున్న కర్తవ్య మరసి
మనమున దుఃఖించి కనలె రాముండు
అలఘువీరుండు ధీరుం డతినీతి పరుడు
లలితమర్యాదుండే లక్ష్మణమూర్తి
అపరాధ మేమియు నవని లేకుండ
విపరీతమౌరీతి విధి చేసె ననుచు
స్వాంతమ్మునం దతిసంతాప మంది
చింతానిమగ్నుండై చెడిధైర్యమెల్ల
చిననాటినుండియు తనతోడు విడక

తనతోడిదే లోకమని విశ్వసించి
తనవెంట వనికి తనయు కేగెంచి
తనకొఱకు బ్రతుకెల్ల త్యాగమ్మొనర్చి
బహువిధ సద్గుణ భాసురుఁ డగుచు
మహిమీఁద వెలసిన మహనీయమూర్తి
తనతమ్ము డిటు లయ్యె, తనరీతి యట్లయ్యె
తన కేమి మిగిలెను ధరణియం దనుచు
గతిలేని మనుజుని కరణి దుఃఖించె
ధృతియెల్లఁ దూలిన రీతి రాముఁడు.

అన్నగారి విచార మరసి లక్ష్మణుడు
అన్నపాదము లంటి యంజలి బట్టి
"సోదరుఁ డనుమను చూడఁ గోరాదు !
నీధర్మమును నీవు నెఱవేర్పు మయ్య
నీయానతిని మీఱి నీమునుముందె
చేయఁగూడని పని చేసితి నేను
ఈయస్థిపంజర మేమైనఁ గాని
నాయాత్మ శ్రీరామ ! నీయందె నిలుచు
కరుణవేటికి ధర్మకార్యమ్ము లందు
వరమునీశ్వరు లెల్ల వాక్రుచ్చినటుల
రక్షింపు ప్రతినను రామ నన్నింక
శిక్షింపు" మనుచును శిరసా నువాల్చె

తమ్ముని శీలమ్ము తమ్ముని భక్తి
తమ్ముని సేవయు తనమది మెచ్చి
"ఎంతసద్గుణమూర్తి వెంతధీరుఁడవు
ఎంతకునమ్మిన దిలను సీతాగ
మున్నలక్ష్మణ!" యంచు నాదర మ్మెసఁగ
కన్నీరు గార్చుచు కౌఁగిటఁ బూని
వగచుచు తాజేయు పనికి నొక్కింత
తెగువతో లక్ష్మణుం డిరిచి రాముండు
పుడమి సర్వాగ్నినైన పొమ్ము నీవనుచు
విపినాడటయుగూడ కడకుచంపుటయె
అని యూత్మలో నెంచి అనుపయ మ్మెసఁగ
అనఘని దిక్కయి యనిచె సీతిని
సన్మతిసద్గుణ చిన్నతమ్ముండ
మన్నింపుమయ్య నామాటకు నిలచి
చేసిత నిన్నివ్వ శిక్షింపవలసె
చేసినదేమి నీదోసమ్ము లేక
శశ్వదాదర్శమై జగతిస నిలచు
శాశ్వతమ్ముగ నీదు సచ్చరిత్రమ్ము
విఘము లక్ష్మణుఁడ ఈ పృథ్విని నాదు
కనులకు నీవింక కనుపడరాదు
విపనాడుచుంటిని విధిలేక నిన్ను
పుడమి నెచ్చటికైన పొమ్మని పలికె.

## లక్ష్మణదేవుని మహాప్రస్థానము

రాముఁడు లేనట్టి రాజ్యమ్ము దేల
రాముని చూడని ప్రాణమ్ము దేల
ఒక్కటే గమ్యమీ యుర్వి లక్ష్మణున
కొక్కటే లక్ష్యమ్ము ఒక్కటే దారి
నా రాముఁడుఁ జగత్కారణుం డైన
శ్రీరామమూర్తి నే చిత్తాన నిలిపి
అచటి వారెల్ల నశ్రువుల్ నింప
అచలధీయుండయి యరిగి లక్ష్మణుడు
భానుకోటి సమాన భాసురతేజ
మానసమ్మున నెల్ల నద్భుతరీతి
నిరుపమనిజయోగ సిద్ధిను బూని
సరయూతరంగిణీ జలముల మునిగె
అరుదెంచుచున్నది హరియంశ యనుచు
సురలెల్ల సాష్టాంగ మెఱఁగి రాఁ జేర.
దేవేంద్రుఁ డేతెంచి దివ్యవిమాన
పావనపీఠాన పవళించఁ జేసి
తనువుతో లక్ష్మణుం గొనిపోయె దివికి
వినువీథులను నిల్చి విబుధు లర్చింప.

దేవతలందఱు దివిపైన తనకుఁ
గావించు పూజలఁ గైకొని వేగ
స్థిరతరాత్మప్రభా తేజస్వి యగుచు
పరమపదమ్మున తరిగె లక్ష్మణుఁడు
ఆదిశేషునిరూప మమరంగఁ దాల్చి
శ్రీదేవి విష్ణుల సేవించు కొఱకు
పతి లక్ష్మణుని మహాప్రస్థానవార్త
సతిధీరచిత్తయై యాలించి లేచి
పరమపదమ్మున పతిఁ జేరుకొఱకు
సురుచిరాత్మజ్ఞాన శోభిత యగుచు
యోగసమాధిలో నూర్మిళా దేవి
వేగఁ బ్రవేశించి వీడెఁ బ్రాణములు.

---

## కుశ లవుల పట్టాభిషేకము

పరమేష్ఠి పంపిన వార్త యే మరల
మరల శ్రీరాముని మదిలోన మెదలె
తనలక్ష్మణునిఁ బాసి క్షణమేని యుండు
మనలేని భావమ్ము మనసులోఁ దోచ
భరతున కిల రాజ్యపట్టమ్ముఁ గట్టి
ధరణిఁ ద్యజించి తా నరుగఁ దలంచె
భరతుఁడు వేగ యావార్త నాలించి

కరుణింపు మని రాముచరణమ్ము లంటి
"శ్రీరామ ! మీపాదసేవయే కాని
ఈరాజ్యభోగమ్ము లేనొల్ల" ననియె
ధాత్రిని రాముఁడే తనకు స్వామిగ
శత్రుఘ్నుడును వేగ చనుదెంచి నుడివె.

తిరుగులే దాతని తీవ్రభావమున
మఱుగులే దాతని మానసమ్మందు
రాముఁడు వేగమే రాజ్యమ్ము వదలి
భూమిని వీడెడి నియమమ్ము నెఱిఁగి
వచ్చిరి బంధువుల్ వచ్చిరి మునులు
వచ్చి రమాత్యులు వచ్చిరి ప్రజలు
శ్రీరామచంద్రుని చేరి కొల్చుచును
బారులై వారిట్లు ప్రార్థించినారు

"కార్యదక్షులు రామ ! కమనీయగుణులు
ధైర్యబలోన్నతుల్ ధర్మతత్పరులు,
వీరాధివీరులు శ్రీరామచంద్ర !
భూరిసాహసులు నీపుత్రు లిద్దఱును
వాసిగా వారికి పట్టముల్ గట్ట
కోసలప్రజలెల్ల కోరిక" యనిరి.

గుణవులు ఉగ్రులు కలముఖ్యు లెల్ల
పరమహర్షమ్మున కాలూఁదఁజేని,
"ప్రవిమలకీర్తితో ప్రాభవ మ్మెసఁగ
నవనినేలుఁ" డటంచు నాశీస్సు లిడిరి

వనమున మన్నించి జనులకోర్కెలను
మనుఁయామోదమ్ము ను నతుండు బడసి
సమముగా భాగించి సర్వకోశలము
సముచిత శాస్త్రోక్త సరణి రాముండు
లలితసద్గుణులైన లవకుశాఖ్యులకు
చెలువొప్ప పట్టాభిషేక మ్మొనర్చి
సురుచిర సామ్రాజ్యశోభ దలిర్ప
చెఱియొక భాగమూ యిరువురికిచ్చి,
మానితవర్తనల్ మహనీయగుణులు
జానకీరాముల సూనులు వారు,
ధీరులై పెద్దలదీవనల్ వడసి
వారివారల రాజ్యభాగమ్ము లందు
భూమినిఁ బాలింప పుణ్యకార్యముగ
ఆమోదహర్షమ్ము లంది కెల్లరును,
రామునివంశమ్ము రాజిలరీతి
భూమిని వర్ధిల్లె పొలుపు రేపారి.

———

## బంధుమిత్రులకు రాముని వీడ్కోలు

తనకార్యభారమ్ము ధరణిపై ముగిసె
తనకొఱకు వికుంఠధామమ్ము వందు
వేగవచ్చు నటంచు వేచియున్నారు
భాగవతోత్తముల్ భక్తు లెల్లరును,
మానవవర్తన మాటయే లేక
ధ్యానమగ్నము లైన తలంపులతోడ
బలమైన యొకదివ్య భావసమాధి
నిలిచెను రాముని నెమ్మది యెల్ల
కదంగి రాముని యూర్ధ్వగమనాభిలాష
పుడమినస్వము పాలికి పూజ్యమై యలరి.
చేరి బంధువుల్ స్నేహితు లెల్ల
శ్రీరాము పాదముల్ సేవించుకొఱకు,
వచ్చె సుగ్రీవుండున్ వానరవరులు
వచ్చెను లంకాధిపతి విభీషణుండు
పౌరులెల్లరు వచ్చి భక్తితోనిలచి
బారులుతీర్చి రా పట్టణమ్మందు
అందఱు శ్రీరాము నర్చించువారె
అందఱు రాముతో నరిగెడువారె.
ఏమాట నెవ్వరి కెటుఁజెప్పవలెనో
ఆమాట శ్రీరాముఁ డరసి వచించు,

పిలిచి విభీషణున్ ప్రీతితో దంకి
"నిలిపి నీధర్మమ్ము నీతియు ప్రేమ
లాలితసగరమ్ము లంకాపురమ్ము
పాలింపు మనుచ ను పంపె రాముండు,
మైంద ద్వివిదు లమృతాంధస్సు లగుట
ఉండరు చిరకాల ముర్విపై నసయి
గనకాళ్ళకత భక్తితన్మయత్వమున
వినయుఁడై యున్నట్టి హనుమంతుఁ జూచి
చిఱునవ్వు నవ్వుచు శ్రీరాముఁ డనియె
"పరమభక్తాగ్రణీ ! పావనీ ! నీవు
వేదాంతమూర్తివి విజ్ఞాననిధివి
కేదిని తులలేని మేటివీరుఁడవు
పరమనిష్ఠాన్విత బ్రహ్మచర్యుఁడవు
పరమేష్ఠి వగుదువు భావికాలమున
ఇలపైన నా పేరు నిలచునందాక
చెలువుగ నీవును చిరజీవివగుచు
ఆసర్వకాల మా హనుమంత నీవు
భాసురయశములో వరలుదువనియె

పౌరులన్ బంధుల పరివారములను
కూరిమితోఁ జూచి కుశలమ్ము లడిగి
చిరసౌఖ్యములఁగల్గి జీవింపుఁ డనుచు

కరుణతోఁ దనశుభ కాంతులఁ దెలిపి
మునులున్నచోటికి వినయుఁడై యేగి
మునుకొను భక్తితో మ్రొక్కి పూజించి
పరమేష్ఠిగముఁడును పరమపూజ్యుండు
ధరణిని తనకులగురువుగా నుండి
తమవంశకీర్తికి తమ శ్రేయమునకు
తమప్రాభవమునకుఁ దగుకారకుఁడైన
మునివసిష్ఠుని పాదవనజమ్ముల నంటి
వినయుఁడై సాష్టాంగప్రణతు లర్పించి
మఱునాఁడె దివికి తా నరిగెద ననుచు
నెఱిఁగించె రాముఁడు స్థిరభావమున

ఆ మునిచంద్రుఁడు నాత్మలోఁ దెలియు
రాముని చిత్తమం దెఱిఁగియున్నదియు
ఎఱిఁగించె మౌనీంద్రవరుల కీవార్త
వరగుణ తత్కార్యసంరంభుఁ డగుచు
రామచంద్రుని మహాప్రస్థానవిహిత
హోమాదులను సిద్ధ మొనరించె వేగ.

---

## శ్రీరాముఁడు వైకుంఠమునకు వేంచేయుట

ఉడువీథి గ్రహరాజి యుచ్చమై వెలిగి
గడియ లొక్కొక్కటి పుణ్యమై గడచి

ప్రవిమలమ్ముగ వచ్చె రామచంద్రుండు
భువిపీఠి దివికేగు పుణ్యకాలమ్ము

ధరియించి వ్రేళుల దర్భాంకురములు
ధరియించి మేనున ధవళాంబరములు
ఆలోకనము నాసికాగ్రాన నిలిపి
నీలకేశమ్ములు వ్రేలాడ వైచి
ఆననమ్మున ధ్యానమౌనమ్ము లెసఁగ
మానితశాంతుఁడు మహితతేజస్వి
రాజగృహము వీడి రాముఁడు వెడలె
భూజను లెల్లరు జేజేలు వెట్ట
భరతశత్రుఘ్నులు భార్యలతోడ
నరుదెంచి నిలిచిరి యిరుగడ లందు
శమ దమ నియమాది సద్గుణచయము
విమలవివేకమ్ము విజయలక్ష్మియును
దాక్షిణ్యకారుణ్య ధైర్య శౌర్యమ్ము
లక్షీణ జపతప స్వాధ్యాయవిధులు
శాస్త్రాగమాజ్ఞల సద్విశేషములు
శస్త్రాస్త్ర కావ్యక చటులశక్తులును
ప్రవిమలోప నిషత్ప్రభాసార మహిమ
వివిధ పూజామంత్ర బీజమాలములు
ఏకతేజోరూప మెరుఁగిన పగిది

ప్రాకటోజ్జ్వల కాంతివాహినిగాఁ
రాముని వెంబడి రమ్యోత్సవముగ
కామితాకృతులతో కదలివచ్చినవి
సురచిర శ్రీరూప సుందరాకృతుల
పురలక్ష్మి యే కాంచె వరుడొంద శ్రీరాము
ఛందోఋషిన్యాసమన్మంత్రప్రణవ
సౌందర్యరూపయై సావిత్రి వచ్చె

గురువులు సచివులు పురజనుల్ మాను
లరుదెంచి రొక పెండ్లి కరిగెడురీతి
పశు పక్షి మృగ కీట ప్రాణిసంతతులు
విశదహార్దమ్మున వెంబడించినవి
భూమిసమస్తమ్ము రామునితోడ
సామోదముగ గూడి సాగినట్లయ్యె
ఆరీతి సరయువు తీరమ్ము దరికి
శ్రీరాముఁ డల్లన చేరునప్పుఁడు
పరమేష్ఠి యాదిగా సురవరు లెల్ల
కరుదెంచి రట రాము నర్చించుకొనుచు.

వినవచ్చె నొకవాణి వినువీథి నంత
జను లెల్ల రాశ్చర్య చకితులై వినఁగ

"శ్రీరామ! రఘురామ! శ్రీపరంధామ!
ధీరగుణాకార! దివ్యావతార!
సకలలోకాధార! సాధువిచార!
ప్రకటితబలసార! పాపసంహార!
చాలింది నీ మానుషాకార మిలను
ఏలగా రావయ్య యెల్లలోకములు
సురుచిర వైభవ సుందరమైన
గరుడవాహన మెక్కి కదలిరావయ్య
జాగేల వైకుంఠసామ్రాజ్యమునకు
వేగరావయ్య శ్రీవిష్ణుస్వరూప!
శ్రీరామ సీతయు చేరియుచ్చోట
నీరాకకొఱకయి నిలిచిన" దనగ
చెవుల సోకినయంత సీతనామమ్ము
ప్రవిమలహృద్ధ్యాన రాముఁ డుప్పొంగ,
అరుదేర తనవెంట ననుగుఁదమ్ములును
సరగున రాముఁ డా సరయువుఁ జొచ్చి
ఘనసుందరంబును విశ్వమోహనము
తనదివ్యరూపమ్ము గలఁచె నెమ్మదిని.

ఒక నిముసమ్ములో నున్నటు లుండి
సకల దిగ్వ్యాప్తమౌ సందీప్తి తోడ
మణికిరీటమ్మును కనకచేలములు

మిసుల కౌస్తుభరత్న కమలహారమ్ము
రాజిత శ్రీవత్స రమ్యలాంఛనము
వైజయంతీమాల వగలు వక్షమ్ము
చక్రమ్ము శంఖమ్ము శార్ఙ్గ పద్మాది
విక్రమచిహ్నముల్ వెలయు హస్తములు
సుగుణాలవాలమ్ము సురుచిరోజ్జ్వలము
జగదేకరమ్యమ్ము శ్యామసుందరము
భానుకోటిప్రభా భాస్వత్ప్రకాశ
మానవమ్మున వెల్గు హరిరూపమునట
లోచనోత్సవముగా చూచువారలకు
గోచరించెను కాంతికోమలమ్మగుచు
భరతశత్రుఘ్నుల భవ్యతేజమ్ము
లరిగి లీనములయ్యె నారూపమందు

శ్రీహరిన్ దేవతల్ క్షితివాసులెల్ల
పాహి, పాహి ! యటంచుఁ బ్రార్థించినారు.
అతిభక్తి శ్రీరాము నడుగుజాడలన
కృతనిశ్చయమ్ముల నెందఱోజనులు
ధరణిని తమకిదే పరమార్థమనుచు
సరయూనదినిఁ జేరి యరిగిరా విమల
వాసిగా వారికి బ్రహ్మకల్పించె
భాసురధామమ్ము స్వర్గవాసమ్ము

సరయూనదీ దివ్యజలముల మునిఁగి
యరిగెను సుగ్రీవుఁ డగ్గనిఁ జేర
అమరశిల్పిని నలుఁ డగ్నిని నీలు
డమలాశ్వినులై చేరి రటులనే వేగ
ఏదేవతాంశల నెలమి వహించి
మేదినిపై జన్మ మెత్తిరో మరల
పూనిరి వారల పూర్వరూపములు
వానరు లెల్లరా వాహిని మునిఁగి.

ధరణికి నంతలో నరుదెంచి నిలచె
పరమాద్భుతమ్ముగా గరుడవాహనము
దేవత లనుచరుల్ దిక్పాలవరులు
సేవించు చిరుగడ చేరి నిల్వంగ
గరుడవాహన మెక్కి కమనీయగతుల
నరిగె నారాయణుఁ డభ్రవీథులకు.

ప్రవిమలభక్తితో దివిజు లానర్చ
వివిధపూజావిధుల్ ప్రీతిగాఁ గొనుచు
తుములమ్ముగా దేవదుందుభుల్ మ్రోయ
విమలసుందరముగా విరివాన గురియ
పరమభాగవతులు పార్శ్వానుచరులు
సురలును దేవర్షివరులును చేరి

శ్యామలాకారా ! శ్రీరామావతార !
క్షేమంకరా ! సర్వజీవనాధార !
సర్వజగన్మాన్య ! సర్వశరణ్య
సర్వేశ్వరా' యని స్వాగతమిడ్డాయ
వాసుదేవుఁడు చేరె వైకుంఠపురము
భాసురమ్మగు తన భవ్యవాసమ్ము.
వైష్ణవీయువతులు వచ్చి హారతులు
విష్ణుకీర్తనఁ జేసి వేడ్క నీయంగ
శ్రీకాంతస్వయముగా చేయూత నిచ్చి
శ్రీకాంతుఁ జేర్చెను శేషతల్పమున.



## వైకుంఠమహిమ

శ్రీదేవి విష్ణువు శ్రీకరాకృతులు
వేదాంతవేద్యులు విశ్వరూపులును
విశ్వకర్తలు వారు విశ్వపాలకులు
విశ్వసంరక్షకుల్ విశ్వాత్మకులును.
లోకకళ్యాణైక లోలాత్ము లమల
వైకుంఠవాసులు వాత్సల్యనిధులు.

పూర్ణసౌందర్యమ్ము పుణ్యధుర్యమ్ము
వర్ణనాతీత మా వైకుంఠమహిమ
సత్యమ్ము శాంతమ్ము సత్వాతిశయము

నిత్యమ్ము నిష్ఠం బ్రహ్మత్వవిధవ
మహిమాత్మానంద మాధ్యాత్మికమ్ము
మోక్షనిధానము ముక్తాశయమ్ము
భాగవతోత్తము భవ్యజన్ములకు
ఆగమోక్తుల కాశ్రయ మ్మదియె.

---

## ఫలశ్రుతి

పరమేష్ఠి భారతి, భర్గుండు పార్వతియు,
సురలును సురమునులు గణించి యట్టి
విష్ణు చరితమ్ము విష్ణుని మహిమ
విష్ణులీలలు వేడ్క కీర్తించి
"సర్వచరాచర జగతి కెల్లెడల
సర్వసౌఖ్యములిచ్చి సంతోష మిచ్చి
సీ సత్కృపాశక్తి నిత్యమై యలరి"
భాసిల్లుగాకంచు వాంఛించి చనిరి
జానకీరాముల చరితమ్ము నందు
మానితోత్తరభాగ మహిత మీగాథ,
సముచిత మాధుర్య సాహిత్య సార
రమణీయ ముత్తర రామాయణమ్ము
చదివిన వినినను జనుల కెల్లరకు
సదములోన్నతిభాగ్య సంపత్కరమ్ము.

## గద్యము

ఇది శ్రీ భారతీ కరుణాకటాక్షలబ్ధ కవితావిశేష హరితసగోత్ర
పవిత్ర రత్నమాంబ నర్రాజార్యపుత్ర కవిశేఖర
కవిభూషణ బిరుదాంచిత సుజనవిధేయ సుబ్బారాయ
నామధేయ ప్రణీతంబైన శ్రీఉత్తరరామాయణకథ
సర్వము సంపూర్ణము
ఓమ్ తత్ సత్.



# శ్రీ కొండేపూడి సుబ్బారావు రచనలు

## ము ద్రి త ము లు

1 కావ్యాంజలి క్రౌను 16+32 పుటలు వెల రు 3-50
రమణీయ ఖండకావ్య సంపుటి

2 గీతామృతము డెమీ 36+328 పుటలు 15-00
18 అధ్యా శ్లోకములు వానికి సులభశైలి
తెలుగు పద్యములు, తాత్పర్యములు

3 గీతాసంగ్రహము డెమీ 48 పుటలు 2-00
భగవద్గీత 18 అధ్యా సారము వచనము

4 సర్వేశ్వరస్తవము డెమ్మీ 32 పుటలు 1-50
ప్రార్థన పద్యశతకము

5 శ్రీవేంకటేశ్వరకర్ణామృతము క్రౌను 72 పుటలు
పద్యకావ్యము 4-00

6 శ్రీ సూర్యనారాయణశతకము క్రౌను
36 పుటలు 2-00

## సులభశైలి ద్విపదకావ్యములు

7 శ్రీమద్రామాయణము క్రౌ 24+300 రు 12-00

8 శ్రీ ఉత్తరరామాయణము క్రౌ 16+128 5-00

9 శ్రీమహాభారతము క్రౌ 16+142 6-00

10 శ్రీమద్భాగవతము క్రౌ 16+312 12-00

మొత్తముగా కొనువారికి ప్రతులసంఖ్యనుబట్టి
తగిన డిస్కౌంటు లభించును